అక్టోబరు

# ౧

విడుదల!

ఆబాలవృద్ధులను
ఆనందముగ్ధులను చేసే
ఆంధ్రప్రజల జాతీయ జానపద చిత్రం...

శ్రీ వేంకటరమణా వారి

# బాలనాగమ్మ

దర్శకత్వం.. వేదాంతం రాఘవయ్య



నిర్మాతలు

డి.యన్.రాజు & ఎస్.యన్.రాజు

RAMDAS.K

FLOODLIGHT

శ్రీ నేషనల్ ఆర్టు పిక్చర్సు రిలీజ్...

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 5

14-10-59
బుధవారం

వికారి ఆశ్వయుజ శుద్ధ త్రయో॥

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
మృగేంద్ర వాహనయైన
కాత్యాయనీదేవి


| | |
|---|---|
| దసరా పోటీ ఫలితాలు | — 4 |
| దేవీ నవరాత్రులు | — 5 |
| సంజీవకునిరంకె | — 8 |
| మనసులో సొగసు | — 11 |
| రాజధాని కబుర్లు | — 12 |
| న్యూఢిల్లీ లేఖ | — 14 |
| తెలుగు వెలుగులు | — 15 |
| ప్రేమవివాహాలు | — 16 |
| అన్వేషణ | — 27 |
| అల్లుడి మంచితనం | — 32 |
| రాశిఫలాలు | — 37 |
| బాలసాహితి | — 39 |
| నాటక ప్రముఖులు | — 40 |
| పాపాయిబొమ్మ | — 41 |
| మామ్మక్కలు | 47 |
| సినిమా | — 56 |
| పుస్తకసమీక్ష | — 64 |
| గళ్ళ నుడికట్టు | — 64 |


# ఉత్తరాలు

## (పటా) పంచశీల

ఆర్యా,

వారపత్రిక (30-9-59) న్యూఢిల్లీ లేఖలో శ్రీకృష్ణ 'పంచశీల' పటాపంచలై పోయిన దనడం చాల ఆశ్చర్యం, కలిగించింది.

ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ క్రిందటి పార్లమెంటు సమావేశములో ప్రసంగిస్తూ, భారత వైదేశిక నీతి, ఏ ఒక్క దేశముతో గల సంబంధ బాంధవ్యముల మీద, ఏ ఒక్క దేశముతో వచ్చిన, లేక రాగల తగవుల మీద ఆధారపడినది కాదన్నారు. పంచశీలను ఎవరు నమ్మినా, నమ్మక పోయినా భారత్ మాత్రం నమ్మి తీరుతుందని స్పష్టం చేశారు. ఇప్పటిదాకా అనేక దేశములు అనుసరించిన 'పంచశీల', ఒక్క చైనా ఉత్తర సరిహద్దులలో కొన్ని మైళ్లు ఆక్రమించినంత మాత్రమున, పనికిరా దనడం అర్థరహితం. ఏ ఒక్క సిద్ధాంతమైన, ఏ ఒక్క దేశము కాదన్న మాత్రమున పటా పంచలవదు. భారత వైదేశిక నీతి, శాంతియుత విధానము మీద ఆధారపడి ఉన్నందున, 'పంచశీల' తగువైన సిద్ధాంతమై ఉన్నది.

మరొకచోట శ్రీ కృష్ణ వ్రాస్తూ, చైనా భారతదేశ సంబంధాల విషయమై రష్యా వైఖరికి ఆశ్చర్యం ప్రకటించారు. భారత్ చైనా సరిహద్దు తగవులో రష్యా తాటస్థ్యం వహించింది. అందుచేత ఈ సందర్భములో చైనాను రష్యా బలపరచక పోవుట, ఒక విధముగా, భారత్ ను బలపరచుటయే.

భారత్ చైనా తగవులలో, భారత్ ను మరి ఏ దేశము బలపరచ లేదనడం నిజంకాదు. యుగోస్లేవియా భారత్ ను బలపరచిందన్న విషయము గమనించ ప్రార్థన.

అసలు, 'పంచశీల' ఇక పనికిరాదనే వారు, మొదటి నుంచీ ప్రధాని శ్రీ నెహ్రూ వైదేశిక నీతిని వ్యతిరేకించిన వారే! భారత్ చైనా సరిహద్దు సమస్య, వీరికి మరొక అవకాశం ఇచ్చింది.

జి. సాంబశివరావు,
పూనా.

* * *

"తెలుగు - వెలుగులు" అన్న శీర్షిక మిక్కిలి ఆకర్షణీయంగా వున్నది. వారం, వారం తప్పక ప్రచురిస్తారని ఆశించుచున్నాను.

యల్.వి.యస్.శాస్త్రి,
(గుంటూరు)

* * *

"పెళ్లిళ్లు కావలసినవాళ్ళు" హాస్యా పెళ్యా రచన చాలా బాగుంది. ఈ వ్యాసం చదివిన స్త్రీలకు కొంత మందికి కోపము రావచ్చు.

టి. లీల (కొత్తగూడెం)

## అక్టోబర్ విడుదల!



ప్రకాశ్ వారి

# రేణుకాదేవి మహాత్మ్యం

[పరశురామావతారం]

నిర్మాత, దర్శకుడు

## కె.యస్. ప్రకాశరావు



రచన: డి.వి. నరసరాజు పాటలు: ఆరుద్ర




CHITRALEKHA

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# దసరా పోటీల ఫలితాలు

తలంట్లు పోసుకుని, కొత్తబట్టలు కట్టుకుని, విల్లంబులు చేత బట్టి, బుక్కాలు చల్లుకుంటూ, ఇంటింటికీ వెళ్ళి "అయ్యవారికి చాలు అయిదు వరహాలు—పిల్లవాండ్లకు చాలు పప్పుబెల్లాలు" అని దసరా పద్యాలు చదువుతూ పిల్లలూ,

దేవీపూజ చేసి, పిండివంటలు చేయించి, నలుగురికి పెట్టి, ఆరగించి పెద్దలూ,

బొమ్మల కొలువులు తీర్చి, పేరంటాలు చేసి ఆడవాళ్ళూ,

అందరూ అన్ని విధాలా ఆనందించే పండుగ దసరా!

ఈ పండుగను పురస్కరించుకుని ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘం సభ్యులకు, వనితలకు రచనల పోటీలు ఏర్పాటు చేశాము. ఈపోటీలలో అనేకులు అత్యుత్సాహంతో పాల్గొన్నారు. అనివార్య కారణాలవల్ల వ్యవధి చాలా తక్కువగా ఇచ్చినా, వనితాలోకం రచనల పోటీకి 500 పైగా రచనలు వచ్చాయి. బాలల సంఘం పోటీలకూ అంతే. రచనలు పరిశీలిస్తే మన రచయితల, ముఖ్యముగా ఆడవారి రచనాశక్తి ఎంత అభివృద్ధి చెందిందో అవగాహనవుతున్నది. అందుచేతనే బహుమతుల నిర్ణయం కూడా కష్టసాధ్యంగా పరిణమించింది.

ఈ కారణాన్ని పురస్కరించుకుని, వనితాలోకం పోటీకి మొదటి రెండు బహుమతులతో పాటు మరొక రెండు 'కన్సొలేషన్' బహుమతులను కూడా ఇస్తున్నాము. మొదటి రెండు బహుమతులు పొందిన వ్యాసాలను ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. మిగతా రెండు వ్యాసాలను తరువాత సంచికలలో ప్రచురిస్తాము.

అలాగే బాలల సంఘం 'ఎ' 'బి' వర్గం పోటీలలో మొదటి రెండు బహుమతులతో పాటు చెరొక కన్సొలేషన్ బహుమతిని కూడా ఇస్తున్నాము.

పోటీలలో గెలిచినవారికి. పోటీలలో పాల్గొని, మా ప్రయత్నాన్ని విజయవంతం చేసిన రచయితలకు మా కృతజ్ఞత. అభినందనలు.

## వనితాలోకం రచనల పోటీ

### మొదటి బహుమతి రూ. 50/-

పాలూరి సుబ్బలక్ష్మి [ఏలూరు]

### రెండవ బహుమతి రూ. 30/-

జి. పద్మావతి [బొంబాయి]

### కన్సొలేషన్ బహుమతులు

వై. అంజనీదేవి [గుంటూరు]

ములుకుట్ల కనకసావిత్రి [బందరు]

* * *

## బాలల సంఘం 'ఎ' వర్గం

### నాటక ప్రముఖులు [మొదటి బహుమతి]

గోవిందరాజు అరుణ (సభ్యత్వపు సంఖ్య 1926. వయస్సు 13సం. మూడవఫారం, గురజాడ,కృష్ణాజిల్లా॥)

### పాపాయి బొమ్మ [రెండవ బహుమతి]

ఆమంచి మనోరమ (సభ్యత్వపు సంఖ్య 1426. వయస్సు 13 సం. ప్రీయూనివర్సిటీ తరగతి,అమలాపురం)

### శభాష్ రాముడు [కన్సొలేషన్ బహుమతి]

వేమూరి శ్రీరామ్ (సభ్యత్వపు సంఖ్య 6174. వయస్సు 13 సం. తుని)

## బాలల సంఘం 'బి' వర్గం

### మా స్కూలు

మొదటి బహుమతి: కర్రా సీతామహాలక్ష్మి (సభ్యత్వపు సంఖ్య 3252. వయస్సు 8 సం॥ 4-వ తరగతి, పాలకొల్లు.)

రెండవ బహుమతి: ఫణిమోహనకృష్ణ (సభ్యత్వపు సంఖ్య 335. వయస్సు 8 సం॥ హైదరాబాదు.)

కన్సొలేషన్ బహుమతి: భమిడిపాటి సుబ్బలక్ష్మి (సభ్యత్వపుసంఖ్య 1892. వయస్సు 8 సం॥ విశాఖపట్నం)

బాలల సంఘం పోటీలలో గెలిచిన వారికిచ్చే బహుమతుల వివరాలు తరవాత ప్రకటిస్తాము.



కొలువు తీరిన బొమ్మలు

# దివ్యదీప్తుల దేవీనవరాత్రులు

భారవి

"అంబా శాంభవి చంద్రమౌళి రబలా పర్ణా ఉమా పార్వతీ
కాళీ హైమవతీ శివా త్రినయనీ కాత్యాయనీ భైరవీ
సావిత్రీ నవయౌవనా శుభకరీ సామ్రాజ్యలక్ష్మీప్రదా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ॥

అంటూ దేవిని ప్రార్థించడం తెలుగునాట ఇంటింటా వింటూంటాం. ఈ దేవీపూజ ముఖ్యంగా దసరా పండుగకు చేస్తారు. అది శరత్కాలంలో వచ్చే పండుగ.

కవులను తేజపరచి, జనుల నుల్లాసపరచే ఋతువులు వసంతశరదృతువులు. వసంత ఋతువు కోకిలకలకల నాదాలతో నిండి వుంటే, శరదృతువు చంద్రచంద్రికాశోభలతో ఒప్పారుతూ వుంటుంది. అందువల్ల ఈ రెండు ఋతువులలోనూ మానవుని ఉల్లాసం చెంగున గంతేసి, చివ్వున చిందేసే అంతగా అవధులు మీరి ఉంటుంది.

పండుగ అంటే అవధులు మీరిన ఆనందానికి చిహ్నమే కదా! అయితే మనపండుగలు కేవలం భౌతికానందాన్నిచ్చే విందు వినోదాలతో కూడినవే కాకుండా, దైవ స్వరూపాన్ని తెలుసుకోడానికి వీలుగా కూడా వుంటాయి. ఇలాంటి మన పండగల్లో అతి ముఖ్యమైనవిగా పరిగణించేవాటిల్లో ఒకటి 'దసరా' పండుగ.

'దశరాత్' అనగా, పదిరాత్రులు జరిపే వుత్సవం కనుక దీనికి దసరా అని పేరు వచ్చింది. అయితే 'దశహర' అన్నదే దసరాగా మారిందని కొందరి సిద్ధాంతం. ఏదైనా మొత్తానికి ఇది పదిరోజులు జరిపే పండుగ. శరత్కాలంలో తొమ్మిది రోజులు దేవీపూజలు జరుగుతాయి కనుక శరన్నవరాత్రులని కూడా అంటూ వుంటారు.

ఈ పండగ ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలుకొని దశమివరకూ పదిరోజులు చేస్తారు. ఇందు మొదటి తొమ్మిది రోజులూ దేవీపూజలు గావించి పదవరోజున దేవిని జలనిమజ్జనం కావిస్తారు.

ఈ దేవీపూజకు ఆచరించే విధులలో (1) కలశ స్థాపన (2) దేవతాపూజ (3) సప్తశత్యాది జపము (4) అఖండదీపము (5) మాలాబంధము (6) ఉపవాసైకభుక్తాది నియమము (7) సువాసినీ భోజనము (8) కుమారీ భోజనము (9) స్తోత్ర మంత్రహోమములనే తొమ్మిది విధములని శాస్త్రాలు చెబుతున్నాయి.

ఇప్పటికీ దేవీనవరాత్రులు జరిపేవాళ్లు ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినుండి ప్రతిరోజూ పగలంతా ఉపవాసముండి సాయంత్రం నక్షత్ర దర్శనం అయిన తరువాత సహస్ర నామార్చనతో దేవికి కుంకుమపూజ చేసి బంధుమిత్రులతో కలసి భుజిస్తూ తొమ్మిది రోజులూ జరుపుతారు. అయితే కొందరు మాత్రం ఈ తొమ్మిదిరోజులూ మంచినీళ్ళయినా త్రాగకుండా ఉపవాసముండి నియమనిష్ఠలతో దేవీపూజలు చేసి పదవ రోజున దేవికి శాంతిమంత్రాలు చెప్పేకనే భోజనం చేస్తారు. ఇలాగ వాళ్ళ వాళ్ళ ఆచారాల్ని బట్టి ఈ నవరాత్రులు చేస్తూ వుంటారు.

ఈ నవరాత్రాల్లో కుమారీపూజని కుమారి, త్రిమూర్తి, కళ్యాణి, రోహిణి, కాళిక, చండిక, శాంభవి, దుర్గ, సుభద్ర అనే పేర్లతో జరుపుతూ వుంటారు. ఈ నవరాత్రాల్లో కడపటి మూడు రోజులనీ దుర్గా



దసరా పేరంటం

చిత్రం: బి. ఎమ్. దేవకి (మద్రాసు).

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారి

# పుస్తక సమీక్ష పోటీ ఫలితాలు

దక్షిణభాషాపుస్తకసంస్థ ఆధ్వర్యాన ప్రకటితములైన 30 పుస్తకాలపై మేము 22-7-59 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటించిన సమీక్షల పోటీకి, ముగింపుతేదీ ఆగస్టు 31 లోగా 530 ఎంట్రీలు దేశం నలుమూలలనుంచి వచ్చాయి. వీటిని ఆంధ్ర సచిత్రవారపత్రిక సంపాదకవర్గంవారు పరిశీలించి మొత్తం 28 బహుమతులు నిర్ణయించారు. వచ్చిన సమీక్షలు చాలవరకు సంతృప్తికరంగా ఉన్నాయని వారు అభిప్రాయ పడ్డారు. పోటీలో పాల్గొని మా ప్రయత్నం విజయవంతం కావడంలో సహకరించిన రచయితలకు కృతజ్ఞత తెలుపుతూ పోటీలో గెలిచినవారిని అభినందిస్తున్నాము. పుస్తకపఠనంపై ఆంధ్రప్రజలు ముందుముందు ఇంకా ఆసక్తి ప్రదర్శించగలరని ఆశిస్తున్నాము. మొదటిబహుమతి పొందిన సమీక్ష ఈ సంచికలోనే ప్రకటిస్తున్నారు. రెండవ, మూడవ బహుమతులు పొందిన సమీక్షలు వీలునుబట్టి తరువాత సంచికలలో ప్రకటించబడతాయి.

## పోటీ ఫలితాలు

మొదటి బహుమతి రు 100/- కుమారి యు. విజయలక్ష్మి ఎం. ఎస్‌సి. కోయంబత్తూరు.
(సమీక్షించబడిన పుస్తకం-"చివరకు మిగిలేది)

రెండవ బహుమతి రు 50/- శ్రీ కె. భావన్నారాయణ, మద్రాసు. ("రాజాజీ కట్టుకథలు")

మూడవ బహుమతి రు 25/-శ్రీ సిహెచ్. కృష్ణమూర్తి, గమలపాడు, గుంటూరు జిల్లా.
("దక్షిణభారత కథాగుచ్ఛము").

**25 అదనపు బహుమతులు రు 5/- చొప్పున-**

1 కొత్తపల్లి రవిబాబు-అంకిశెట్టిపల్లి (సిద్ధార్థ)
2. ఎల్. కె. రత్నమాల-రాజోలు (ఇంటింటి సౌభాగ్యము)
3. వేగుంట కనకరామబ్రహ్మం-ఏలూరు (రాజాజీ కట్టుకథలు)
4. ఎస్. సత్యనారాయణమూర్తి-హైదరాబాద్ (చివరకు మిగిలేది)
5. టి. రాఘవేంద్రరావు-గుంటకల్ (ప్రసిద్ధ నాటికలు)
6. ఎం. శేషాచలపతి-హైదరాబాదు (పౌరుడు-రాజ్యాంగము)
7. బి. వరహాలరావు-శంకరంపేట (పౌరుడు-రాజ్యాంగము)
8. అడుసుమల్లి పూర్ణచంద్రరావు-విజయవాడ (తొలిమానవులు)
9. ఎస్. ఎస్. ఆర్. మూర్తి-రాజమండ్రి (కథామంజరి)
10. టి. రాఘవేంద్రరావు-గుంటకల్ (సుబ్బన్న)
11 ఎ. వి. రామారావు-పరిశపాలెం (దేశం ఏమైంది)
12. ఏళ్ళ సింహాచలంనాయుడు-బందలుప్పి (ప్రాచీనకావ్యమంజరి)
13. గొర్రెపాటివెంకటసుబ్బయ్య-ఘంటసాల (పేపరు పాపాయి)
14. కుమారి కె.బి.కృష్ణవేణి-మైసూరు (సంగ్రహకథాసరిత్సాగరము)
15 కె. వి. వి. రాఘవాచార్యులు-నర్సాపురం (కోకోగో)
16 అనిసెట్టి వెంకటరమణారావు-విజయవాడ (వేటగాడికొడుకు)
17. టి. రాఘవేంద్రరావు-గుంటకల్ (కథామంజరి)
18. కుమారి కె. బి. కృష్ణవేణి-మైసూరు (కోకోరో)
19 వి. వి. రామకృష్ణరావు-పాతేరు (పౌరుడు-రాజ్యాంగము)
20. కిడాంబి వెంకటవీరరాఘవాచార్యులు-నర్సాపురం (రాజాజీ కటుకథలు)
21 చక్రవర్తి పి.ఎస్. వేణుగోపాల్-అనంతపురం (సంసారసాగరం)
22. జి. ఉమాపతిశర్మ-సికింద్రాబాద్ (ప్రాచీన కావ్యమంజరి)
23. ఎ. మురళీధర్-హైదరాబాద్ (సిద్ధార్థ)
24. మధుసూదనరావు సిరసిల్లా (చివరకు మిగిలేది)
25. వి. శ్యామసుందర్-నాయనిపల్లి (కథామంజరి)




**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
**రాష్ట్రపతి రోడ్ - సికింద్రాబాద్**



# ★ దివ్యదీప్తుల దేవీనవరాత్రులు ★

ష్టమి, మహార్నవమి, విజయదశమి అనే పేర్లతో ముఖ్యమైనవిగా మనవారు భావిస్తూ వుంటారు.

దేవీ పూజలలో దుర్గాదేవితో బాటు ధనశక్తి లక్ష్మిని, జ్ఞానశక్తి సరస్వతిని కూడా పూజిస్తూ వుంటారు. తొమ్మిది రోజులూ దేవీపూజ చేసేవారు పదవనాటి ఉత్సవానికి అపరాజిత పూజ, సీమోల్లంఘన, శమీ పూజ విధిగా చేస్తారు. దశమి నాడు మేళతాళాలతో దేవిని ఉత్సవంగా వూరేగించి జలనిమజ్జనం చెయ్యడానికే సీమోల్లంఘనం అని పేరు.

దుర్గాదేవికి నవసంఖ్య ప్రీతికరము అవడం వలను, నవదుర్గలు అని ప్రతీతి వుండడం వల్లను ఈ వుత్సవాలలో నవదుర్గల యొక్క గుణగణ మహిమావిశేషాల్ని తెల్పే విగ్రహాలని ప్రతిష్ఠించి ఒకోరోజు ఒకో విధంగా పూజలు చేస్తూ వుంటారని కొందరంటారు. బహుశా ఈ ఆచారం తాలూకు పోలికలే నేమో ఈనాటి మన బొమ్మలకొలువులు.

ఇంతే కాకుండా, ఈ పండగ క్షత్రియుల పండగ కనుక, విజయదశమి నాడు క్షత్రియులు ఈ పండగలో శమీపూజ చేసి జైత్రయాత్రకి బయలుదేరేవారనీ, వారు విజయంతో తిరిగి వచ్చినప్పుడు తాము తెచ్చిన ధనకనక వస్తు వాహనాదులన్నీ, సంపద సౌభాగ్యాలన్నిటినీ అందరూ చూడడానికి వీలుగా ప్రదర్శన మేర్పాటు చేసేవారనీ, ఆ సంప్రదాయమే నేటి బొమ్మల కొలువుల రూపంలో నిలిచిందని కొందరంటూ వుంటారు.

ఈ సందర్భంలో ఒక చిన్న విషయం మనవి చేయాలి. అదేమిటంటే—విజయదశమినాడు శమీపూజ చేసి విజయయాత్రకి బయలుదేరిన రాజులు తిరిగివచ్చేసరికి కనీసం రెండుమూడు మాసాలైనా పడుతుంది కదా! అంటే ఇంచుమించుగా సంక్రాంతి దరిదాపుల్లో తిరిగి వస్తారన్నమాట. అప్పుడే వారు ప్రదర్శన మేర్పాటు చేసేవారన్నమాట. ఆ సంప్రదాయమే బొమ్మల కొలువుల రూపంతో ఈనాటికీ నిలిచివుందని అనుకుంటే—బహుశా అందుకే కాబోలు కొందరు దసరాకే కాకుండా సంక్రాంతికి కూడా బొమ్మల కొలువులు పెడ్తారని వూహించవలసి వుంటుంది.

ఈ దసరా ఉత్సవాల్ని కులమత విచక్షణ లేకుండా ఆసేతు హిమాచల పర్యంతం భారతీయులందరూ అనాదిగా ఆచరిస్తూ వుండేదే. ఉత్తరాదివారు ఢిల్లీ ప్రాంతాల్లో రామలీల ఉత్సవాలు తొమ్మిది రోజులూ జరిపి దశమినాడు రావణ కుంభకర్ణుల బొమ్మల్ని తగలబెట్టి రాముడికి విజయం చేకూరినట్టుగా ఈ పండగని చేస్తారు. మిగతా ప్రాంతాల్లో దుర్గాదేవికి విజయం చేకూరినట్టున్నూ, విజయుడు (అర్జునుడు) కి విజయం చేకూరినట్టున్నూ చెప్తూ జరుపుకుంటూ వుంటారు. ముఖ్యంగా దక్షిణాదిన మాత్రం దేవీ పూజలతో బాటు, బొమ్మల కొలువులు పెట్టడం దసరా పద్యాలు పాడడం ఆచారంగా ఈనాటికీ నిలిచివున్నాయని మనకి తెలుసు. బాలబాలికలకి కళా దృష్టి, గుణగణ స్వరూపం తెలియ చెప్పడానికిన్నీ, స్నేహధర్మాన్ని పెంపొందింపజెయ్యడానికీ ఈ బొమ్మల కొలువులు పెట్టడం, దసరా పద్యాలు పాడడం మనవారు ఏర్పాటు చేసి వుంటారు.

ఈ దసరాపండుగని గురించి సురవరం ప్రతాపరెడ్డిగారు హిందువుల పండుగలు అనే పుస్తకంలో విశదంగా రాసేరు. అంతే కాకుండా రాయలవారి ఆస్థానంలోనూ, వారి సామంతుల ఆస్థానాల్లోనూ కూడా ఈ పండగని చాలా విశేషంగా జరుపుతూవుండే వారనీ, ఆవుత్సవాలను చూచిన అబ్దుర్రజాక్, పయస్ అనే ఆనాటి చారిత్రకులు కూడా ఈపండుగని వర్ణించారని ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో కూడా వ్రాసేరు. ఇంకా ఈ పండగని గురించీ, దేవీ పూజావిధివిధానం, దేవీ మాహాత్మ్యం గురించి తెలుసుకోవాలంటే దేవీ భాగవతంలోనూ, పురాణాల్లోనూ కూడా మనకి ఎక్కువగా కన్పిస్తుంది.

ఉత్తర గోగ్రహణ సమయంలో అర్జునుడు జమ్మిచెట్టుని పూజించి ఆయుధాలు గ్రహించడంవల్లనూ, రావణవధకి ముందు రాముడు దేవీపూజ శమీపూజ గావించి విజయం పొందడంవల్లనూ,

"శమీ శమయతే పాపం శమీ శత్రు వినాశినీ
అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియ దర్శినీ"

అంటూ విజయానికి చిహ్నంగా విజయదశమినాడు శమీపూజ చేస్తూండడం ఆచారమైంది.

నిజానికి ఈ విజయదశమిని గురించి యుగయుగాలుగా చెప్పుకునే గాథలనేకం వున్నా వాటిలోకల్లా ముఖ్యంగా చెప్పతగినది మహిషాసురమర్దనికథ.

మహిషుడనే రాక్షసుడు బలదర్పంతో విజృంభించి దేవతలనోడించి దేవేంద్రపదవిని ఆక్రమిస్తాడు. దేవతలుగాని, త్రిమూర్తులుగాని ఎవరూ కూడా ఆ రాక్షసుణ్ణి జయించలేకపోతారు. అప్పుడు దుర్గాదేవి ముక్కోటి దేవతల శక్తుల్నీ, త్రిమూర్తుల శక్తుల్నీ తనలో సంఘటితపరచుకుని చాముండీ అవతారం దాల్చి, సింహవాహనంమీద సింహనాదం చేస్తూ మహిషాసురుడితో యుద్ధానికి వెళ్లింది. చాముండీదేవి తొమ్మిదిరోజులు మహిషాసురుడితో యుద్ధంచేసి పదవరోజున అంటే దసరాదశమిరోజున ఆ రాక్షసుని చంపి విజయాన్ని చేపట్టింది. మహిషాసురుని మరించింది కనుకనే దుర్గ మహిషాసురమర్దని అయింది. ఆవిడ విజయాన్ని పొందినరోజే విజయదశమి అయింది.

కాగా, త్రేతాయుగం తరువాతనుంచి రామునిపరంగాను, ద్వాపరయుగం తరువాత విజయుని పరంగాను విజయదశమీ ప్రాశస్త్యాన్ని చెప్పుతూ రాగా ఈనాటికి మనం దీన్ని గురించి రకరకాలుగా కథలూ గాథలూ చెప్పుకుంటూ ఈ పండుగని చేసుకుంటున్నాం. మైసూరులోనూ, కలకత్తాలోనూ ఈ దసరా వుత్సవాలూ, దేవీ పూజలూ ఈనాటికీ చాలా విశేషంగా జరుగుతూ వుంటాయి.

ఆనాడు చాముండీదేవి అవతారాన్ని దృష్టిలో పెట్టుకునే ఎంతటి అసురశక్తినైనా సంఘటితశక్తితో జయించవచ్చునని భావంతో వివిధాయుధ సంఘటితశక్తి చిహ్నంగా మహార్నవమినాడు ఆయుధపూజ చేయడమనేది సత్యకాలంనాటి నుంచీ మనవారు పాటిస్తూ వచ్చేరు. ఏతావతా ఈ పండగకు దేవీపూజ ముఖ్యమని మనకి స్పష్టమౌతూ వుంది. ఇక మిగిలిన విశేషాలన్నీ వ్యక్తుల తాలూకు అభిరుచులమీదే ఆధారపడి వుంటాయి. ★

# సంజీవని ఆశ

అప్పుడే పాఠశాల ప్రాంగణంలో అడుగెట్టిన వాడు, చేతిలో సంచి పుచ్చుకుని స్కూలు గుమాస్తా సంజీవి ఎదురవడంతో నే హృదయం గంతులేసింది.

"చెక్కొచ్చిందా సంజీవీ?" అన్నారు.

"అవునండీ. చిటూగ్గా వెడుతున్నాను—క్యాష్ చేసుకురావడానికి" అంటూ వెళ్లాడు సంజీవి.

సాయంత్రం అయిదుగంటలకు సంజీవి రాక కోసం ఎదురుచూసిన ఉపాధ్యాయబృందం నిరాశ చెంది, ఏడుగంటల బస్సు కోసం చూడడం ప్రారంభించారు. కాని రెండోసారీ నిరాశే ఎదురైంది. తప్పకుండా మూడో బస్సుకు, అనగా రాత్రి ఎనిమిది గంటలకు సంజీవి డబ్బు తెస్తాడన్న ఆశతో స్కూల్లోనే కూర్చున్నాం.

ప్రధానోపాధ్యాయులు పరంధామయ్యగారికి మెరుపు లాగా ఓ ఆలోచన తట్టింది.

"ఏమండీ యిలా మనం కాలయాపన చెయ్యాటం దేనికి? ఎలాగూ సంజీవి ఎనిమిది

● ఆర్. వి. జి, కృష్ణమూర్తి

గంటలకొస్తాడు. అప్పుడు అక్విటెన్సు రిజిస్టరులో సంతకాలు పెట్టడం ప్రారంభిస్తే యింకా ఆలస్యమైపోతుంది. కాబట్టి యిప్పుడే ఆ పని పూర్తిచేద్దాం" అన్నాడు. అందరూ "సరే నంటే సరే" అని ఆ కార్యంలో నిమగ్నులయ్యారు.



సాంతం లెక్కించి సంతకాలు పెట్టే కార్యక్రమం పూర్తయ్యే సరికి ఎనిమిది కింకా పావుగంట వుంది. అందరి మనస్సుల్లోనూ సంజీవి ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకుని "చూడండి ఓ స్కూలుకు గుమాస్తా కూడా ఎంత ముఖ్యమైన వ్యక్తో" అంటున్నాడు.

* * *

అసలు సంజీవి రూపురేఖావిలాసాలు అందరికీ ఆసక్తి కలిగిస్తాయి. మనిషి అంత పొడుగూ గాదు-పొట్టీ గాదు. పీచు తీసివేసి జుట్టుమాత్రమే గల కొబ్బరికాయను, కాయ భాగాన్ని పైకి, జుట్టు భాగాన్ని క్రిందికి వచ్చేటట్టు నిలబెట్టినట్టుంటుంది పిల్లి గడ్డంతో వున్న అతని ముఖాకృతి! ఇక అతని మీసం మూతితో ఏమాత్రం సంబంధం లేనట్లు పెరిగి వుంటుంది! గజిబిజిగా వుంగరాలు తిరిగి రెండు మూడు పిచ్చుకలు ఒకదానితో నొకటి సంబంధం లేకుండా కాపురాలు చేసుకోవచ్చు ననిపిస్తుంది సంజీవి క్రాపు.

సంజీవికి వున్న మూడు చొక్కాల్లోనూ అతుకులు లేనిది ఒక్కటిలేదు. "ఒకప్పుడు ఖాకీ యూనిఫారం ధరించిన యీ తనువు యీనాడు అతుకుల చొక్కా ధరిస్తూంది. ఓడలూ, బళ్లూ సామెత నా విషయంలో యథార్థం మూర్తిగారూ!" అన్నాడోసారి సంజీవి.

రెండవ ప్రపంచ సంగ్రామంలో సైనికుడుగా పనిచేసి, విదేశాలెన్నో చూచి అనుభవం గడించిన వ్యక్తినన్న ఘనత, ఆగ్రాలో రెండువందల యాభైమంది ఆంగ్లేయులచేత తాను పెరేడ్ చేయిస్తుంటే, ఆంగ సైనికాధికారులు తన శక్తిసామర్థ్యాలు చూచి విస్తుపోయి నిల్చున్న వైఖరి వర్ణన, రంగూన్‌లో తనను ప్రేమించి విఫలమనోరథయై, ఆత్మహత్యోద్యమాసక్తురాలైన ఓ ఆంగ్ల యువతిని తాను రక్షించి ఆమెభర్తకప్పగించిన వైనం-యిత్యాదులన్నీ సంజీవి సైనిక జీవితంలో మాయని మధురానుభూతులు.

ఆయా విషయాలు వర్ణించేప్పుడు సంజీవిలోని ఉత్సాహం, ఉద్రేకం, తన్మయత మరపురానివి. అవన్నీ నమ్మమని శ్రోతల్ని ఎప్పుడూ బలవంతపరచడు సంజీవి! చక్కగా పదినిముషాలసేపైనా నిలబడలేనంత కండపుష్టిగల సంజీవి వీరగాథలూ, ఎవర్నో ఒకర్ని త్వరగా వివాహమాడితే చాలన్న కక్కుర్తిగల యువతిగూడా మొదటి చూపులోనే తన వివాహవాంఛను చంపుకునేట్లు చేయగలఅందగాడు. సంజీవియొక్క ప్రేమకలాపాలన్నీ విన్న శ్రోతలు వాటిని ఎంతగా నమ్మాలని ప్రయత్నించినా మనస్సు ఎదురుతిరగక మానదు.

విదేశాలలో నెలకు ఏడువందలాయాభై

రూపాయల జీతనం (సంజీవి చెప్పిన ప్రకారం) పొందుతూండిన సంజీవి, యిదానంతరం ఓ స్కూలులో గుమాస్తాగా పనిచేయడమెలా సంభవించిందీ—అని ఎవరైనా ప్రశ్నిస్తే సంజీవి సమాధానమొక్కటే:-"ప్రభుత్వం నాకన్యాయం చేసింది" అని "ఎందుకలా చేసింది?" అని ఎవరూ మళ్ళీ ప్రశ్నించరు. ఓ వేళ ప్రశ్నించినా సంజీవి జవాబివ్వకుండా నిశ్శబ్దంగా వెళ్ళిపోతాడు.

"ప్రొద్దుట్నించీ ఎక్కడి కెళ్ళావ్? కనిపించనే లేదు," అన్నానో సాయంత్రం సంజీవినుద్దేశించి.

"మూర్తిగారూ! నిజమనుకోండి అబద్ధమనుకోండి ఇప్పటికి రోజు ఇరవైమూడు ఆస్ప్రో బిళ్ళలు మింగానండి. హెవీవర్కుతో తల పగిలిపోతోంది" అన్నాడు. తలనొప్పితో బాధపడే ఒకానొక మనిషి ఒక్కరోజే ఇరవైమూడు ఆస్ప్రో మాత్రలు మింగడం నేను పుట్టి బుద్ధెరిగిన తర్వాత వినడం ఇదే మొదటిసారి! ఈ విషయాన్ని నేనెలా నమ్మగలను? అందుకే గాబోలు ముందే చెప్పాడు సంజీవి— అబద్ధమనుకున్నా పరవాలేదని.

"ఏం విశేషాలు సంజీవ్?" అని ఎవరైనా వూసుపోక ప్రశ్నిస్తే ఎన్నో విశేషాలు చెప్పగల సామర్థ్యముంది అతగాడికి. మార్కెటులో వంకాయల వెల దగ్గరనుంచి రష్యావారి కృత్రిమ ఉపగ్రహాంతరకూ విషయాన్ని ఎరించినా 'నాకు తెలియదు' అని సంజీవి ఏనాడూ అనలేదు. పైగా, అన్ని విషయాలు తనకు తెలిసినంత క్షుణ్ణంగా మరెవరికీ తెలియదన్న అహంభావంకూడా ఉంది. ప్రతి విషయానికీ, ప్రతిసంఘటనకీ కొంచెం అతిశయోక్తి మిళాయించడం సంజీవి స్వభావం. ఉదాహరణకి—"మా ఆఖరి పిల్లాడికి ఏడాది లేదు—ఏడు ఇడ్లీలు ప్లేటులో పెట్టిస్తే విసిరి అవతలగొట్టి, డజనుకు ఒక్కటి తక్కువైనా అక్కర్లేదంటాడండి" అంటాడు సంజీవి, ఏడాది పిల్లాడికి ఏడు ఇడ్లీలు చాలకపోవడం. డజను యిడ్లీలు కావాలనడం అతని దృష్టిలో సహజమే! కాని ఆమాట చెప్పేటప్పుడు తనకి ఏడాది బిడ్డ ఒకడు వున్నాడా, లేడా అని ఆలోచించడు సంజీవి.

* * *

సంజీవి గురించిన ఆలోచనలు బుర్ర నలుమూలలా ఆక్రమించుకొంటూండే సమయంలో ఎక్కడో బస్సు శబ్దం కనిపించింది. ఉపాధ్యాయులంతా రోడ్డువైపు వెళ్ళారు. కాసేపటికి అంతా దిగులుపడివచ్చేశారు.

సంజీవి రాలేదు! ఏమైనట్టు? ఎందుకు రాలేదు? ఇంతకు ముందే నాపై రాలేదు. కాస్త ఆలస్యంగా కడపటి బస్సుకైనా వచ్చేవాడు ఈసారి అదీ లేదు!

* * *

సంజీవికి ఆస్తిపాస్తులేమీ లేవు. గంపెడు




"ఇంకో చోటికి వెళ్ళిపోతున్నా. ఇక్కడగాలి మొహం మొత్తేసింది"
బహుమతిపొందిన కార్టూన్: కస్తూరి విశ్వనాధ్, మద్రాసు.

సంసారాన్ని యీదుకురాలేక తలకుమించిన అప్పులుచేశాడు వూరంతా. వాళ్ళో అతనంటే చాలామందికి సదభిప్రాయం లేదు అప్పులు చేయడంలోనూ, చేసిన అప్పులు తీర్చక పోవడంలోనూ సంజీవిని మించిన నేర్పుగల ఆ వూరి పొలిమేరలు యింతవరకూ త్రొక్కలేదు. అందుకనే అతనికి సమాజం గౌరవ స్థానాన్నివ్వలేదు. కాని అతనికి ఆవూళ్ళో గౌరవం లేదని సంజీవి ఎన్నడూ చింతించలేదు.

డబ్బుయావలేని మానవుడు లేడు! కాని సంజీవి ధనావసరాన్ని చాలా తేలిగ్గా తీసుకుంటాడు. "నాకేమిటండీ కాశ్మీరు విషయంలో ఇండియాకూ, పాకిస్తానుకూ ఓ వేళ యుద్ధం జరగవచ్చునీ ఆ యుద్ధంలో చేరడానికి నన్ను సిద్ధంగా వుండమనీ, నెలకు రెండు వందలాయాభై యిస్తామని నిన్న రక్షణశాఖనుంచి ఓ వుత్తరం వచ్చిందిమూర్తిగారూ!" అన్నాడు ఒకసారి సంజీవి.

నాకు ఆశ్చర్యమేసింది. "నిజమా, సంజీవ్! కంగ్రాచ్యులేషన్సు" అన్నారు.

"కాని— నేను రాసేశాను. పూర్వం నెలకు ఏడువందలాయాభై యిచ్చేవారు. ఇప్పుడూ అదే గ్రేడ్లో వుంచితే వస్తాను. లేకుంటే నాకవసరంలేదు అని..." అన్నాడు సంజీవి.

ఓ వైపు పుట్టెడు అప్పుల్లో మునిగిపోతూ, పెళ్ళాం బిడ్డలకు భుక్తికికూడా కరువైపోయి బాధపడే సంజీవేనా మాట్లాడేదీ అనిపించింది. లేక ఏదైనా దయ్యం గియ్యం ప్రవేశించి యితనిచేత యీ విధంగా పలికిస్తుందా అనికూడా అనిపించింది. నిజం తెలుసుకుందామని "ఏదీ—రక్షణశాఖనుంచి వచ్చిన ఉత్తరం చూపు" అన్నాను. లాల్చీ రెండు జేబులూ తడుముకుని కంగారుగా "సారీ— మరచానండీ ఎక్కడ పెట్టానో ఏమో... వెధవది—ఒకటైతేగదూ" అంటూ లేచాడు సంజీవి.

* * *

హరికేన్ లాంతర్ల వెలుగున అందరూ ఆలోచిస్తూ కూర్చున్నారు. తెలుగుపండితుడు శాస్త్రిగారికి ఏదో ఆలోచన తట్టినట్టుంది. అతని మిత్రుడు జానకిరామయ్యని దూరంగా పిల్చుకెళ్ళి చెవులో వూదాడు.

శాస్త్రిగారూ, జానకిరామయ్యగారూ కలిశారంటే మండేమంటకు వాయువు తోడైనట్లే!

శాస్త్రిగారు ప్రారంభించారు—"ఇంకేం సంజీవండే డబ్బు మాటతో చెక్కేశాడు! మనకు దొరుకుతాడూ యికి? వూరంతా అప్పులయితే"

జానకిరామయ్య "తందాన తాన" అన్నాడు.

ఆలోచనలతో సతమతమౌతున్న ప్రధానోపాధ్యాయులు వాళ్ళమాటలు వినలేక దూరంగా వెళ్ళి కూర్చున్నారు.

ఉపాధ్యాయుల కందరికీ "నిజంగా సంజీవి పరారైవుండొచ్చు" అనిపించింది.

సంజీవి పరిస్థితీ ఆవూళ్ళో అలాగేవుంది. అప్పులవాళ్ళబాధ పడేకంటే అవిధంగా పలాయనం చిత్తగించడమే ప్రాణానికి సుఖం, మనస్సుకిహాయి!

డబ్బుతో పరారైపోయాడన్న వార్త అందరిహృదయాల్లోను ధ్రువపడ్డంతో శాస్త్రి మరో విషయం బయటపెట్టాడు.

"ఏమండోయ్ ఇక మనం ఈ నెల జీతాలకికూడా తిలోదకాలిచ్చుకోవల్సిందేనండోయ్. ముందే జీతాలు పుచ్చుకున్నట్టు స్టాంపువేసి సంతకాలు చేశాంగా!" అన్నారు.

నెలజీతం వదలుకోవాలన్న బాధ రాగానే నా ప్రక్కనే కూర్చున్న డ్రాయింగు మేష్టారు ముకుందరావు కళ్ళ

# ★ సంజీవకుని ఋంకె ★

లోని నీటితెర ఆ గుడ్డి వెలుగులో నే నాక్కనుపించింది. ఆ కలిలో అలమటించే భార్యాబిడ్డలు మనసులో మెదిలుంటారు గాబోలు!

శాస్త్రిగారి తొందరపాటు ఎందరి హృదయాలను కలచివేస్తోందో. ఆయన్ని వారిద్దామని ప్రయత్నించాను. కాని శాస్త్రిగారి ముందు నేను మాట్లాడ్డం అంతమంచిది గాదు. శాస్త్రిగారు తనమాట నెగ్గించుకునేందుకు ఎంత నీచానికైనా పాలుపడే వ్యక్తి!



సంజీవి పరారీవార్త ప్రధానోపాధ్యాయులను పూర్తిగా కలచివేసింది. వారికిగూడా సంజీవి అన్నివిధాలా పరారీగాదగ్గ వ్యక్తి కాదనిపించింది. గోపాలకున్న చెవులు చేరవేశాయి కాబోలు, అర్ధగంటలో వూళ్ళో పలుగురికీ యీ విషయం తెలిసిపోయి పరామర్శ చేసేందుకు వచ్చి, ఎదుటలేని సంజీవిని చెడామడా నాలుగు తిట్టి, క్రింద వుమిసి వెళ్ళారు.

వీళ్ళంతా, ఆఖరికి పరంధామయ్యగారు గూడా, సంజీవి డబ్బుతో మాయమైనాడని ధ్రువపరిచేందుకు పోయిన నెలలో జరిగిన ఒక సంఘటన అందరి హృదయ ఫలకాల మీదనుంచి యింకా చెరిగిపోలేదు.

ఇలాగే పోయిన నెలగూడా చిత్తూరులో చెక్కు మార్చేందుకు వెళ్ళిన సంజీవి సాయంత్రం మొదటి బస్సులోనూ, రెండో బస్సులోనూ తిరిగి రాలేదు. అలవాటు ప్రకారం కాచుకూర్చున్న ఉపాధ్యాయులు ఆఖరి బస్సు వచ్చేవరకూ బస్సుస్టాండువద్దనే ఆగిపోయారు.

బస్సు రావడంతోనే చుట్టూ మూగిన ఉపాధ్యాయులు డబ్బు సంచీతో దిగిన సంజీవిని చూట్టంతోనే అంతసేపు వారి నిరీక్షణ వ్యర్థం కాలేదుగదా అని పొంగిపోయారు.

"ఇంతాలస్యమేం సంజీవీ" అని ప్రధానోపాధ్యాయులు ప్రశ్నించినా, గ్లాసుడు చల్లటినీళ్ళు గొంతులో పోసుకోందే మాట్లాడలేదు.

"ఏంలేదు సార్, ఈరోజు నేను జైలు కెళ్ళాలిసింది" అన్నాడు తాపీగా సంజీవి.

కారణంకోసం అందరూ అతనివైపే చూస్తున్నారు. మరోగ్లాసు మంచినీళ్ళు తెమ్మన్నాడు బంట్రోతుని. అంతవరకూ చెప్పలేదు. ఆ రాత్రిసమయాన గుడ్డి వెలుతురులో సంజీవి జైలుకెళ్ళాలిసిన పరిస్థితి ఎలా సంభవించిందో - అలాంటి ఆపదనుంచి ఎలా బైటపడగలిగాడో, తెలుసుకోవాలన్న ఉత్కంఠ ప్రతివ్యక్తికీ అతిశయించిపోయింది. బంట్రోతు మంచినీళ్ళు తేవడానికీ, తెచ్చిననీళ్లను తాను పుచ్చుకోడానికీ, ఆపైన త్రాగడానికీ పట్టే ప్రతి సెకండూ ఉత్కంఠను రెట్టింపుచేస్తున్నాయి.

"ఓరి భడితస్సదియ్యా! చంపేస్తున్నాడే, వెధవ సస్పెన్సుతో" అనిపించింది నాకు.

మళ్ళీ హెడ్మాస్టరుగారే అడిగారు: "ఏమిటి కారణం సంజీవీ?"

"డబ్బుతీసుకుని, లెక్క చూచుకుని సంచీలో వేసుకున్నాను. కట్టుకున్న ధోవతి కొంచెం వూడింది. దాన్ని సరిచేసుకుందామని ఎదుట స్టూలుమీద సంచిపెట్టి క్రిందికి అలావంగేను సార్...అంతే! తలెత్తేసరికి సంచీలేదు. అంతా ఒక్క సెకండు...వెనక్కి చూచాను. ఇద్దరు

(61-వ పేజీ చూడండి)

# మనసులో సొగసు

అవసరాల రామకృష్ణారావు

ప్రియమయిన రాధా, నీ ఉత్తరం అందింది. నేను చాలా మారిపోయాననీ ఇన్నాళ్ళకి నా కాపురం పచ్చగా ఉండడం చూసి ముచ్చటపడ్డానని రాశావు. చాలా సంతోషం. ఏళ్ళకొద్దీ ఒకేవిధంగా పెరగడానికి అలవాటయిన శరీరమూ, ఒకేవిధంగా ఆలోచించడానికి అలవాటయిన మనస్సూ మారడం చాలా...చాలా కష్టం. కాని మారిన నా మనస్సుకి వెనుక ఒక మహత్తర వ్యక్తి కథ ఉంది. ఆ కథ నా మనసులో పటం కట్టి దాచుకున్న గాథ. వింటావా?

నేను చాలా బద్ధకస్తురాలిననీ, అటు వస్తువు ఇటు పెట్టలేనంత సుకుమారిననీ చదువుకున్న రోజుల్లో తెగతిట్టిపోసేదానివి. నిజమే. ఇచ్చ రూపాయలతో గచ్చకాయలాడుకునే అమ్మకి నేనొక్కర్తినే సర్వస్వం. నోటు అంటించి సిగరెట్టు కాల్చుకొనే భర్తకి నేనొక్కర్తినే ప్రపంచం. సహజమైన నా బద్ధకం స్వైరవిహారం చెయ్యడంలో అభ్యంతరం ఏముంది? వంటకీ పైపనికీ, నీళ్ళు కాచడానికీ, పిల్లల్ని ఆడించడానికీ, అన్నిటికీ పనిమనుషులున్నారు. పుస్తకంతో పొద్దుపుచ్చే మస్తకం నాదికాదని నీకు తెలుసు. నా కింకేం తోస్తుంది? నా మనసులోని శూన్యం వేసే గంతులికి అంతం లేకపోయింది. విపరీతమైన విసుగు, చెప్పలేని చిరాకు, అతినీరసంగా ఉన్మాదావేశం, ఏ గడియకు ప్రాణం పోతుందో అనే భయం ఈ చిత్రమైన మనస్తత్వంతో ఇది అని చెప్పలేని మనోవ్యాధితో బాధపడిపోయాను. ఆయన పడ్డ ఆదుర్దా నా రోగాన్ని పెంచింది. ఆఫీసు వదిలి ఆయనా, నోరెరగని నా పిల్లలూ నా మంచం వదిలేవారు కారు. ఊళ్ళోఉన్న డాక్టర్లందరూ మా యింట్లోనే ఉండేవారు. కాని థర్మామీటరుకీ, సెతస్కోపుకీ, ఎక్స్‌రేకీ అతీతమయిన నా జబ్బుని ఎవరు పోల్చగలరు? ఎలా కుదర్చగలరు? ఆయన ఎన్ని చోట్లనో చూపించి ఎన్ని వేలో ఖర్చుపెట్టారు. ఎవరూ ఏంలేదు పొమ్మన్నారు. ఆఖరికి బెజవాడలో శ్రీరాజుగారని, గొప్ప వైద్యుడని పేరులే—వారి ప్రైవేటు హాస్పటలు నడుపుతున్నాడు—అక్కడికి తీసుకెళ్ళారు. ఒక రూంలో నన్నుంచారు.

మా పక్క రూంలో గుండె జబ్బు పేషెంటు ఒకామె ఉండేది. మా రెండు గదులకీ పెద్ద కిటికీ అడ్డం. ఆ కిటికీకి సరిపోయే ఎత్తులో నా మంచం ఉండేది. ఒక రోజు ఆవిడ దగ్గిరికి ఒకపాతికేళ్ళ అబ్బాయి వచ్చాడు. అంత పెద్దవాడు ఏమన్తూంటే నా మనస్సు సహజంగా అటు ఆకర్షింపబడింది.

'ఛా, ఊరుకో...ఏమిటదీ? ఇప్పుడు నాకేమొచ్చింది తమ్ముడూ...ఊరుకోమంటే...నాకోసం బెంగెట్టుకున్నావా బాబూ...ఇలారా...దగ్గిరగా కూచో... అయ్యో.. ఇలా చిక్కిపోయావేంరా?'

'నువ్వు మనిషివా దేవతవా? నువ్వు మాకెలా దక్కుతావు అ-క్క-య్యా!'

'ఊరుకోమంటే, నీకేం మతుందా లేదా? ఇప్పుడు నాకేమొచ్చింది?'

'అవును, నీకేమొచ్చింది? నువ్వు కులాసాగానే ఉన్నావు మహా అంటే మూడొందల వరకు బ్లడ్ ప్రెషరు ఉంటుంది. వారానికి ఒక హార్ట్ ఎటాక్ వస్తూఉంటుంది. [illegible] పటగు. సరిగ్గా నిల్లకిలా పడుకోలేవు నీకేమొచ్చింది? ఏమీ రాలేదు?...నీ కంటికి నేనే చిక్కిపోయినట్లు కనిపిస్తున్నాను. ఇంత బాధలో ఎదుటివారిగురించి ఆలోచిస్తావ్! ఇలాంటివానివి ఇలాంటిదానివి మా కెందుకు దక్కుతావు అక్కయ్యా!'

'ఏంరా తమ్ముడూ ఇందుకేనా నువ్వొచ్చింది? ఇకేనా ఈ స్థితిలో నువ్వు నాకు చెప్పే ధైర్యం?'

'లేదక్కయ్యా లేదు...ఒక సంతోషమొచ్చినా ఒక దుఃఖమొచ్చినా భరించలేని సామాన్య మానవుణ్ణి. ఏదో అనేశాను...అది సరే...శ్రీరాజుగారు మళ్ళీ చూశారా? ఏమన్నారక్కయ్యా?'

'తగ్గిపోతుందన్నారు బాబూ...దానికేం గాని నాన్న దగ్గు ఎలా ఉంది? కాస్త తగ్గిందా?'

'మాకేం? మేం అందరం హాయిగా ఉన్నాం. ముందు నీ మాట చెప్పు ఈమధ్య మళ్ళీ 'బ్లడ్ ప్రెషరు' నోట్ చేశారా?'

'నే[illegible] కొంచెం తగ్గిందట. ఎందుకింత వర్రీ అయిపోతావు బాబూ ఇంతింత పెదజబ్బులు వచ్చింతర్వాత ఒక్కమారుగా తగ్గిపోతాయా? నెమ్మది నెమ్మదిగా తగ్గుతోంది. ఇదివరకువచ్చిన ఎటాక్ కంటె కాస్త తక్కువగానే వచ్చిందని మన వాళ్ళతో చెప్పు. సరేగాని చూడూ.. ఈ పక్కనే నీళ్ళుపోసేమనిషి ఉంటాడు. నీళ్ళు పెట్టించుకుని పోసుకో...వెళ్ళు... హోటల్లో భోంచేసిరా...యీ ఎదురుగుండా ఉన్న హోటలు కాదు. బస్సుస్టాండు దగ్గిర హోటలుకి వెళ్ళు అక్కడ బాగుంటుందిట. మీ బావ చెప్పేరు.'

'అన్నట్టు ఆమాటే మరిచిపోయాను, బావేడి అక్కయ్యా.'

'ఆయనా వచ్చేవేళయింది.....చూడు తమ్ముడూ ఒక్కమాట...ఆయనతో మందుల ఊసెం ఎత్తకు...రాత్రీ పగలూ ఒక్కలా చాకిరీ చేస్తున్నారు. అసలే అర్భకంమనిషి. పూచికపుల్లలా అయిపోయారు. ఒకటే బెంగ.. తీసుకూచుని మీ అందరిచేత చేయించుకుంటున్నాను. మీ బావకి కాస్త ధైర్యం చెప్పు బాబూ'

'అక్కయ్యా, ఒక్కమాట అడగనా?'

'అడుగు తమ్ముడూ దానికేం?'

'బావ యింకా నిన్ను సాధించడం మానలేదా?'

'ఎవరి స్వభావం వాళ్ళది. కాస్త గట్టిగా మాట్లాడ్డమే సాధింపు అనుకుంటే మనం ఎలా బతగ్గలం తమ్ముడూ...నాన్నయినా ఆయనయినా అభిప్రాయభేదాలు వస్తే నా మీద అభిమానంచేతే కదరా!'

'నీ కిక్కడ ఏంతోస్తోందే అక్కయ్యా?'

'తోచడానికేముంది? సరిగ్గా కిటికీదగ్గిర కూచుంటాను. ఈ కాంపౌండులోనే యీ డిస్పెన్సరీకి నీళ్లుతెచ్చేవాడి కుటుంబం ఉంది. వాడికి మూడు మేకలూ నాలుగు కోళ్లూ ఉన్నాయి. వాటితో ఎప్పుడూ నగ్నంగా ఉండే నాలుగేళ్ళ నల్లపిల్ల, వాడి కూతురనుకుంటాను. వాటిని తోలుతూ ఆడుకుంటు ఉంటుంది. ఈ కిటికీలోంచి వాళ్ళనిచూస్తూ కాలక్షేపం చేస్తాను. నాకళ్ళకి యింకే రంగుల్ని పోల్చేదృష్టి పోలేదు. ఎర్రని పువ్వులూ, నీలం ఆకాశమూ నాకిక్కణ్ణుంచీ లీలగా కనిపిస్తాయి... నాకేంలోటు? తమ్ముడూ అలాదుఃఖపడకు బాబూ.....

(68-వ పేజీ చూడండి)

# బాపిరాజు చిత్రపటావిష్కరణ

## రాజధానీ ఖబుర్లు

ప్రవీణ్

"నాకు పాపికొండలంటే ఎందుకో ఇష్టం. బహుశః పేరులో గల పోలికలే దీనికి కారణమేమో?" ఈ వాక్యాలు, ఈ వాక్యాలవంటి వాక్యాలు, ఆకాశవాణి మదరాసు కేంద్రంనుండి పదిపదిహేను సంవత్సరాల క్రితం వినవచ్చాయి.

ఈ వాక్యాలు కీ. శే. అడవి బాపిరాజువి. కాని కంఠం ఆయనది కాదు. 'కారణాంతరాలవల్ల' శ్రీ బాపిరాజు రాలేకపోవడంవల్ల ఆయన 'ప్రసంగవ్యాసాన్ని' ఆకాశవాణి ఉద్యోగి ఒకరు చదివారు. బాపిరాజుగారు బ్రతికుండగా ఆయన్ను చూడలేకపోయినా, ఆయన కంఠం విని ఊహించుకొనే అవకాశం ఆ కారణంగా జారిపోయింది. 'ఆయన గేయాలున్నాయి కదా? నవలలున్నాయిగదా? ఆయన గీసిన బొమ్మలున్నాయిగదా?' అంటారు మీరు. నిజమే! కాని ఆయన కలం పట్టుకున్న తీరు, ఆయన రంగుల పిరాబుడ్డిలో పిరాకం, ఆయన పాడిన పాటల వెనుక ఉచ్ఛ్వాసనిశ్వాసాల వేడిమి–ఇవి కొలవాలనుంటుంది నాకు.

ఇది తప్పేయేమో బహుశః? కాని శ్రీ కృష్ణశాస్త్రి సమయానికి జ్ఞాపకం చేసినట్లు, హోమర్ బ్రతికున్నప్పుడు ముష్టెత్తుకోవలసివచ్చిన ఆరు నగరాలు, అతడు చనిపోయిన తర్వాత 'అతడు మావాడు', అంటే 'మావాడు' అన్నాయట. బహుశః కలం విడిచిన పిరాకంపై, కలం కదలికకు కారణమైన హృదయస్పందన ఎక్కువేమో? ఏమో!

బాపిరాజుగారు హైదరాబాదులో 'మీజాన్' తెలుగు దినపత్రిక సంపాదకులుగా ఉండేవారు. ఆ కాలంలో వారు నాంపల్లి వద్ద 'బాజార్ ఘాట్'లో ఉండేవారట. బహుశః అక్కడేవున్న వేమనాంధ్ర భాషానిలయం మెట్లెక్కి వచ్చి లోపల కూచొనేవారేమో? అక్కడ పత్రికలు, పుస్తకాలు చదివేవారేమో? ఆ వేమనాంధ్ర భాషానిలయంలో ఆయన చిత్రపటం ఆవిష్కరింపబడింది గతవారం. శాసన సభాపతి శ్రీ కాశీశ్వరరావు చేశారు ఆవిష్కరణ.

ఈ ఆవిష్కరణ సభకు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి అధ్యక్షత వహించారు. సింగరాజు లింగమూర్తి, ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య, కురుగంటి సీతారామయ్య ప్రభృతులు ప్రసంగించారు. అందరు బాపిరాజును తమ స్నేహితుడుగా, స్నేహపాత్రుడుగా, ఆప్తుడు,బంధువుగా పేర్కొన్నారు. ఆయన జీవితంనుంచి సంఘటనలు కొన్ని పేర్కొన్నారు. కనపడని కన్నీటితో చిత్రపటాన్ని తడిపారు.

వారూ వీరూ, సభలోనూ, బయటా, చెప్పిన, చెప్పుకొన్న సంఘటనలన్నీ కూర్చుకున్నాను: నాముందు బాపిరాజు రూపం సాక్షాత్కరించింది. దీనికి పదిపదిహేను సంవత్సరాలముందు విన్న ఆకాశవాణి ఉద్యోగి కంఠం జోడించుకున్నాను.

ఒకసారి శ్రీ బాపిరాజు 'మీజాన్' పత్రికా కార్యాలయంనుంచి వస్తూంటే, ఒక సభవారు కనపడి విశేషాలు మరునాటి ఉదయం పత్రికలో ప్రచురితం అయ్యేటట్టు చూడమని బ్రతిమాలుకున్నారట. ఆయన, ఇంటికివెళ్ళి, వివరాలు టెలిఫోన్‌లో తెలిపారట. మీజాన్ పత్రిక నాలుగుపుటల్లో రెండు, మూడుపుటలు సాయంత్రం ఒకటవ, నాల్గవపుటలు ఉదయం ముద్రితమయ్యేవి. రాత్రి పనిచేసిన సహాయ సంపాదకుడు మధ్యపుటల్లో చోటుంటే ఈవార్తను అక్కడ ముద్రింపచేశారట. ఉదయం సహజంగా ఒకటవ, నాల్గవపుటలను వెదికిన బాపిరాజు, వార్తావివరాలు కనపడక ఉగ్రులయ్యారు. పగలు పనిలోకి వచ్చిన సహాయ సంపాదకుణ్ణి పిలిచి, 'ఫలానావాడు ఈ విధంగా నామాట వ్యతిరేకించాడు. నువ్వేనా వెయ్య' అన్నారట.

ఆ ఉద్యోగి వార్త రాసివ్వడం, రాత్రి వచ్చిన ఉద్యోగి ఆ వార్తను తీసెయ్యడం జరిగింది. మర్నాటిఉదయం బాపిరాజుగారు మండిపడి, 'నువ్వుకూడా నామాట వ్యతిరేకిస్తున్నావా?' అన్నారు, పగలు పనిచేసే ఉద్యోగిని చూసి. అతడు తాను రాసి ఇచ్చానని, రాత్రి వచ్చిన సహాయ సంపాదకుడు తీసేశాడని చెప్పారు. వెంటనే ఆయన కోపంగా ఒక ఉత్తరం రాత్రి వచ్చే ఆయన పేర వ్రాసి, బల్లమీద పెట్టి వెళ్ళిపోయారు. ఇంటికి వెళ్ళేదారిలో ఈ సభ సభ్యులు–ఆసభ నిర్వహించిన పెద్దలు–కనపడి, కోరినంతనే వెంటనే వార్త ప్రచురించినందుకు బాపిరాజు గారికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

తన పొరపాటు గ్రహించిన శ్రీ బాపిరాజు హృదయం ఆవేదనాభరితమైంది. ఇంటికి వెళ్ళగానే, ఆ ఉత్తరం ఆ బల్లపైనుంచి తీసెయ్యమని, ఎట్టిపరిస్థితులలోను ఆవిషయం ఆ సహాయసంపాదకునికి తెలియనీవద్దని, తెలిస్తే అతగాడు బాధపడతాడని, ఉద్రేకంతో, కంపించిపోతూన్న కంఠంతో టెలిఫోన్‌లో చెప్పారట. ఈ సంగతి అతగానికి తెలిసింది-తర్వాత! అతడే చెప్పాడు ఈ ఉదంతం. అంతటి లేతహృదయముట ఆయనది.

లేతహృదయమే మరి. కాని – అసహాయోద్యమదినాల్లో మామగారు తహసీల్దారుగా ఉన్నచోట కల్లుగీత పాడకుండా చేసే కార్యక్రమంలో పాల్గొని, తాను పోలీసులను ఎదిర్చి, మామగారి ఉద్యోగానికి దాదాపు ముప్పు తెచ్చిన వ్యక్తి. బందరు జాతీయ కళాశాల ప్రధానాచార్యులుగా ఉన్నప్పుడు జాతీయ ముస్లిం నాయకుడు ఒకడు చిన్నవిసరి ఎత్తడానికి పనివారు నిరాకరిస్తే, తానే ఎత్తివచ్చిన మనిషి. ఇంట్లో అవసరమైన కార్యానికి సుభవపడే అప్పుగా సంపాదించుకున్న ఇరవై ఐదు రూపాయలతో–దారిలో కళ్లకు మూడానికి ముచ్చటగా ఉన్న వస్తువులు కొనేసి, నవ్వుతూన్న హృదయంతో ఇంటికి చేరిన కళాహృదయుడు.

మానవుడు–"బాపిరాజు"కి పర్యాయపదం "మానవుడు."

* * *

## గంగాధరశాస్త్రి స్మృతి

1954 జనవరి 17–వ తేదీ రాత్రి బందరునుంచి వచ్చిన ఒక నాటక బృందం ఉస్మానియా స్త్రీ కళాశాల దర్బార్ హాల్లో ఒక నాటకం ప్రదర్శించింది. పాత్రలన్నీ స్త్రీలే ధరించారు. నాటకం ప్రారంభించిన తరువాత, రంగస్థలంమీదకి కొద్దిసేపట్లో

# రాజధాని కబుర్లు

పోవలసిన ఒక పురుషపాత్రధారిణికి ఒక ఛత్రం, ఒక ఉత్తరీయం అవసరం అయ్యాయి.

అవి లభించని తెచ్చుకున్న నాటక సామగ్రిలో లేకపోలేదు కాని, ఆ సమయానికి అక్కడ లేవు. ఇటువంటి సంఘటనలు నాటకీయుల జీవితాల్లో జరుగుతూనే ఉంటాయ్ కదా? నిర్వాహకులు తెరమరుగున ఉండి, ప్రేక్షకులలోకంపై పు తెరిపార చూశారు. ముందు వరసల్లో నిశ్శబ్దంగా నాటకం చూస్తున్న ఒక ముసలాయన భుజంమీద ఉత్తరీయం వుంది; చేతిలో గొడుగు వుంది. అవి రెండూ అతి నిశ్శబ్దంగా అనతికాలంలోనే రంగస్థలం మీద ప్రవేశించాయి.

నాటకం ముగిసిన తర్వాత ప్రేక్షకులందరూ వెళ్ళిపోయారు. పరస్పరాభినందన (కించిత్ విమర్శన) కార్యక్రమంలో మునిగి తేలుతున్నారు నటీనటులు. ఆ ముసలాయనఅక్కడకువచ్చినిలబడ్డారు. ఎవరోవచ్చి, ఆయన వస్తువులు ఆయనకు అందిచ్చారు.

ఆయన అయిదారు సంవత్సరాల నుండీ హైదరాబాదులో కనిపిస్తూనే ఉన్నారు. ఆంధ్ర యువతీ మండలివద్ద. నారాయణగూడాలో, హిమాయత్ నగర్ ప్రాంతంలో ఇంకా అక్కడా, ఇక్కడా. ఆయన పల్లెటూరినుంచి కొత్తగా పట్నానికి వచ్చిన వారు కాదు; కాని అలా ఎరుగున్న వాళ్ళకి కూడా కనపడ్డం మానలేదు. ఓర్పుకి, అంతులేని ఓర్పుకి నిర్వాణం ఆయన. ఎంతో ఎక్కువని ఎంతో కొంచెంలో అదుముకొని, అదుముకొన్నట్టు కనపడని వ్యక్తి ఆయన.

ఆయన రాజధానిలో కాని, మరెక్కడా కాని ఇక కనపడరు. ఆయన శ్రీ ముసర్ల గంగాధరశాస్త్రి. అంటే—'ఆయనా గంగాధరశాస్త్రి అంటే?' అనకమానరు జనం. రెండువారాలక్రిందట ఆయన చనిపోయారు.

సంగీత విద్వాంసుల కుటుంబంలో జన్మించారు. తమంత తాము సంగీతం అభ్యసించి అభినివేశం కలదని నిరూపించుకున్న తర్వాత తండ్రిగారి వద్ద వీణ నభ్యసించారు. సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ సంజీవరావువద్ద తీసుకున్న ఫ్లూటుతో, రహస్యంగా ఎవరికీ తెలియకుండా వెళ్ళి, బంధువు నక్కలతోట దాటి వెడితే వచ్చే బహిరంగ ప్రదేశాలలో అభ్యాసం చేశారు. కచ్చేరీలు చేసి దాక్షిణాత్యుల అభినందనలు పొందారు. పెద్దరికంలో వైద్యుల సలహాపై ఆ విద్యను భగవదర్పితం చేసి, తిరిగి వీణను చేపట్టారు. పండు ముసలితనంలో ప్రాణాలు విడిచారు ఈ నెల.

గతవారం శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో సంతాప సభ జరిగింది. శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి అధ్యక్షత వహించారు. పర్వతనేని వీరయ్య చౌదరి, ముసర్ల నాగేశ్వరశాస్త్రి ప్రభృతులు నివాళు లర్పించారు కీర్తిశేషునికి. ఆయన శిష్యురాండ్రు, మనుమడు, మనుమరాలు ఆయన నేర్పిన విద్యను సదస్యుల ముందు ప్రదర్శించారు.

## ఎవడు సత్యాన్వేషి?

ఆకాశవాణి హైదరాబాదు కేంద్ర ప్రయోక్తల నాటక నిర్వహణాశక్తి నానాటికీ ఉత్తమస్థాయికి చేరుకుంటోంది. ఇది గమనించి అభినందింప తగిన విషయం. కానిపాత్రధారుల ఎన్నికలోను, పాత్రధారుల నటనా కౌశలంలోను శక్తి ఉడుగుతూన్నట్టు కనపడుతూంది. ఇది విచారకరమైన విషయం.

శ్రీ అడపా రామకృష్ణారావు రచించిన "సత్యాన్వేషి" అనే పెద్ద నాటకం గతవారం ఈ కేంద్రంనుంచి ప్రసారమై, ఇతర కేంద్రాలనుంచి పునఃప్రసారం చేయబడింది. అది సోక్రటీస్ కథ. సోక్రటీసు వంటి వేదాంతి కథను నాటకానికి ఇతివృత్తంగా స్వీకరించి రచించడం సామాన్యం కాదు. ఒక గంట చక్కని నాటకాన్ని రచించి ఇచ్చారు శ్రీ అడపా. వారిని ముఖ్యంగా అభినందించాలి.

ఈ రచనకు చక్కని రూపం కల్పించాలని ప్రయోక్తలు కొంతవరకు తీవ్ర ప్రయత్నం చేసినట్లు కనిపిస్తోంది. 'కొంతవరకు' అనడానికి కారణం ఉంది.

నాటకం 'ఎవరు సత్యాన్వేషి?' అన్న ప్రశ్నతో ప్రారంభం అవుతుంది. అతడు సోక్రటీసు. ఎదుట వినువెంటనే తనకు దొరికిన సమాధానాలతో తృప్తిచెందక, ప్రశ్నలను సదస్యుల హృదయాలలోకి చొచ్చుకు పోయేటట్టు చేసిన తత్త్వవేత్త. అతడు అహంకారి కాడు. తన వాక్యాలలోని పదాల నిగ్గుకీ, తన కంఠంలోని మాధుర్యానికీ మురిసిపోయే ఉపన్యాసకుడు. అతడు సత్యాన్వేషి. అంటే నిజంగా, నిశ్చయంగా సత్యాన్వేషి.

ఈ సత్యాన్వేషి, ఆకాశవాణి సౌజన్యం వల్ల, తనవారిని ఏ దేశంవాడూ అంగీకరించలేని పరిస్థితిలో పడ్డాడు. ఈ సత్యాన్వేషికి తాను మహోపన్యాసకుడినని గర్వం. ఎదుటివాణ్ని వాదనలో ఇట్టే ఓడించివేయగలనని గర్వం. నాలుగో తరగతి హిందీ సినిమాలో విలన్ పాత్రధారిలాగ ముసిముసి నవ్వులు నవ్వుతుంటాడు. షేక్స్పియర్ 'జూలియస్ సీజర్' సరిగ్గా అర్థం చేసుకోని ఏంటనీ పాత్రధారిలా నటిస్తాడు. దానికితోడు ఇరవై ఐదు సం॥ల యువకుని కంఠం.

శ్రీ పాలగుమ్మి విశ్వనాథం మధురమైన సంగీతంతో ప్రారంభమైన నాటకం, 'ఎవరు సత్యాన్వేషి?' అంటే 'సోక్రటీస్' అంటూ పాటి కేకలతో అంతం ఔతుంది. సోక్రటీస్ శీలాన్ని, అతని భార్య శీలాన్ని చక్కగా రూపొందించారు రచయిత. చక్కగా ప్రతిధ్వనులతో ప్రారంభమైంది నాటకం. ప్లేటో పాత్రధారి కంఠాన్ని సోక్రటీస్ కిస్తే చక్కగా రాణించేది నాటకం. కాని ఏ ప్రయోజనం? గోడలు, గోడలు, గోడలు మనసులకు గోడలు. ★

# పత్రికలపై ప్రధాని కినుక!

## న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణ

స్వదేశంపట్ల తమ కనీసధర్మం గుర్తెరిగి పత్రికలు కొన్ని విమర్శలు చేస్తాయి. ప్రభుత్వ విధానాలపైగాని, పరిపాలనలోని లోటుపాట్లపైగాని ఆరోగ్యకరమైన విమర్శ జరుపనంతవరకు అవి వుండి ప్రయోజనం లేదు. నిన్న మొన్నటిదాకా పత్రికాపత్రికలు ప్రధాని అభిమానాన్ని చూరగొన్నాయి. కాని యీనాడు ఆయనకు పత్రికా విమర్శలు బాధాకరంగా ఉంటున్నాయి. అయితే ఈ విమర్శలు సహేతుకమైనవి అవునా కాదా?

గడచినవారం ఢిల్లీలో విచిత్రమైన వాతావరణం కనిపించింది. శ్రీలంక ప్రధానమంత్రి శ్రీ బండారనాయకే దారుణహత్యకు ఢిల్లీ విషాదంలో మునిగిపోయింది. ఇది ఎక్కడి సంప్రదాయమో—ఈ కిరాతకం బర్మాలో మంత్రిమండలి నంతటినీ హత్యచేసింది. పాకిస్తాన్‌లో లియాఖత్ అలీఖాన్‌ను పొట్టన పెట్టుకున్నది.

శ్రీ బండారనాయకే ఘోరహత్యకు చలించిన ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ చండీఘర్‌లో ఇలా అన్నారు. 'హింసాత్మక శక్తులు, విధానాలు, పరిభాషలు, పెరిగిరిం ప్రలు మరీ మితిమీరిపోతున్నాయి. మన దేశంలో వీటివ్యాప్తిని అరికట్టాలి'. ఈ మాటతో అంతా ఏకీభవించితీరుతారు. ఇండియాలో హింసాశక్తులు మరీ ఇటీవల స్వైరవిహారం చేస్తున్నాయి. రైలుపెట్టెలు ...ని పాపానికి మొన్న నీమధ్య ఢిల్లీ సమీపంలోని గాజియాబాద్‌లో రైల్లో ప్రయాణిస్తున్న ఒక యువతిని రివాల్వర్‌తో కాల్చడం అంతా జరిగినదే. మరో స్త్రీని నడుస్తున్న రైల్లోంచి క్రిందకు నెట్టివేయడంకూడా జరిగింది.

ఇటు హింస ఇలా పెల్లుబికిపోతుంటే మరోవైపునుంచి 'అహింస' పేరిట ఆత్మహింస పెచ్చుపెరిగిపోతున్నది. 'నిరశన వ్రతాలు' ఇందుకొక ఉదాహరణ. రాజ్యాంగబద్ధమైన పద్ధతులలో సక్రమపరిపాలన తప్పినప్పుడు ప్రజాస్వామ్యం నిరంకుశపాలన కావడమూ, తత్ఫలితంగా ఈ అరాచకాలన్నీ పెరగడమూ సహజం.

కమ్యూనిస్టులనుగూర్చి చండీఘర్‌లో ప్రధానమంత్రి అన్నమాటలు దేశం మొత్తం మీద అంతా హర్షించారు. అయితే ఒక్కరూ దానిని గట్టిగా తీసుకోలేరు. దాదాపు పట్టించుకున్నట్లే లేదు. చండీఘర్‌లో ఆయన అన్నమాటలనుబట్టి, దేశంలో కమ్యూనిస్టు పార్టీ బహిష్కరింపబడుతుందనుకోవడం పొరబాటు. ఇలా కొందరు అనుకోడానికి రెండు నెలలుగా పార్లమెంటులోను, బయటకూడా ప్రధానమంత్రి చేస్తున్న ప్రకటనలే కారణం. పశ్చిమబెంగాల్ శాసనసభలో చెప్పులు విసిరిన కమ్యూనిస్టు సభ్యులు ఇంతవరకు క్షమాపణ కోరుకోనకపోవడం ప్రధాని ప్రస్తావించారు. ఒక్క క్షమాపణతో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కుదుటపడుతుందన్నమాట!

* * *

పబ్లిక్, ప్రయివేటు రంగాలను గురించి ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ఇటీవల వార్తాపత్రికలు వీటిని గురించి చేసిన వ్యాఖ్యానాలను ఖండించారు. ఈ సందర్భంలోనే ఆయన వార్తాపత్రికల పరిశ్రమకూడా ప్రయివేటురంగంలోనిదేనని ప్రకటించారు.

రక్షణబలాల నిర్వహణ, రైల్వేశాఖ ఇటువంటివిపోను పబ్లిక్ రంగంలో తతిమ్మా శాఖలన్నీ ప్రయివేటురంగంలోని పారిశ్రామికుల చేతనే నిర్వహింపబడుతున్నాయి. ప్రయివేటువ్యక్తుల యాజమాన్యం పరోక్షంగానే అయినా పబ్లిక్ రంగంలో ఎంతో వుంది. జాతీయంచేయడానికిముందు రిజర్వుబ్యాంకు సలహాసంఘంలోవున్న ఐదుగురు డైరెక్టర్లకు బదులు మరో ఐదుగురిని వేయడం ఇంతవరకు ప్రధానమంత్రికి సాధ్యంకాలేదు. పాతవారే ఇంకా పదవుల్లో ఉన్నారు. జాతీయంచేయబడి చిరకాలమైనా ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ సంస్థ ఈనాటికీ 'టాటా' లు వారి వ్యాపారంకోసం స్వయంగానె నిర్వహించుకుంటున్నారు. ఇది అసలు సమస్యలో ముఖ్యభాగం.

పబ్లిక్ రంగానికి ప్రధానస్థానం కేంద్ర సచివాలయం. రేడియో, సమాచారశాఖ, ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో కార్యాలయమూ, పార్లమెంటు స్ట్రీట్‌లో మరో కొత్తభవనంలో ఏర్పాటుచేశారు. ఇదే భవనానికి పక్కగా యునైటెడ్ కమర్షియల్ బ్యాంకువారి నూతన భవనాలు కూడా ఉన్నాయి. ఇవి రెండూ రెండురంగాలకు చెందినవి. పబ్లిక్ రంగానికి చెందిన సమాచార శాఖాభవనం దుమ్ముకొట్టుకొని మకమకలాడుతూ ఉంటుంది. కిటికీ ముక్కలు కూడా తుడవడం అక్కడ ఆచారంలేదు. లోపల వివిధశాఖలలో పనివుండి వెళ్ళినవారికి మురుగు దొడ్ల దుర్గంధం కొడుతూవుంటుంది. 'సమాచారం'లో శుభ్రత, సౌందర్యం 'అచారం' కావా అనిపిస్తుంది.

ఇక యునైటెడ్ కమర్షియల్ బ్యాంకు భవనం శుభ్రతకు వెలసిన సంకేతం. కిటికీ చువ్వలు మచ్చలేకుండా మెరుస్తూ వుంటాయి కిటికీలు తుడవడానికి తగు ప్రబంధాలూ ఉన్నాయి. ఇందుకోసం కేంద్ర సచివాలయంలో ప్రత్యేకంగా కొంత సిబ్బందినికూడా ఏర్పరచిన సౌభాగ్యం శ్రీ నెహ్రూకు దక్కుతుంది. కాని ప్రయోజనం చూస్తే బాధ కలుగుతుంది. యునైటెడ్ కమర్షియల్ బ్యాంకుకు శుభ్రతకోసం ప్రత్యేకసిబ్బంది అంటూ లేనే లేదు. ఆ బ్యాంకు 'చప్రాసీ'లే శుభ్రపరచి నిగనిగలాడే తమ బ్యాంకు భవనాన్ని చూసి గర్వపడుతూవుంటారు.

ఒక్కసారి శ్రీ నెహ్రూ పబ్లిక్ రంగం స్థితిని పరిశీలించడంకోసం కేంద్ర సచివాలయానికి విచ్చేసినట్లయితే మన సామాన్య ప్రమాణాలలో పతనం ఆయనకు గోచరిస్తుంది. కేంద్ర సచివాలయం ఆయన ఒక్కసారి దర్శిస్తే సమగ్ర శుభ్రత, కష్టపడి పని నిర్వర్తించడం, క్రమశిక్షణ వంటి సామాన్య ప్రమాణాలలో ఎంతపతనం కలిగిందో ఆయనకు కన్నులకడుతుంది.

పబ్లిక్ రంగంలో పతనాలకు భాక్రా ఆనకట్ట మరో చక్కని నిదర్శనం. ఇటీవలనే అక్కడ గండిపడిన సంగతి అందరకు తెలిసిందే. 'కొంచెం పగులు చూపిందంతే' అంటారు అధికారులు. కాగా అక్కడి మరమ్మతులే మూడింతలు! అంటే దాదాపు 2.5 కోట్ల రూపాయలు కాగలవని అంచనా. జీవితభీమావ్యవహారంలో వలె ఈ చిన్న వ్యవహారాలలో భారతీయ సివిల్ ఇంజనీర్లు కొంత అనుమానించబడుతున్నారు. ప్రధానికి అభిమానపాత్రులైన జాతీయసేవకులలో ఇంజనీర్లు ముఖ్యులు. కనుక రెండున్నర కోట్లతోనే సరిపుచ్చుతున్న వీరికి మనమంతా కృతజ్ఞులంగా ఉండాలి.

* * *

పత్రికలు: ప్రధాని నిశితదృష్టికి ఈసారి ఇవికూడా గురిఅయినాయి. పత్రికలు ప్రయి

(63-వ పేజీ చూడండి)

# తెలుగు వెలుగులు-6

## శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రి

ఒకప్పుడు మోటారు సైకిల్ మీద ఖులాసాగా షికారు సాగిస్తూ ఉండగా పొగరెక్కిన పొట్టేలొకటి వారి వెంటబడి తరిమింది. సైకిల్ మరింత జోరుగా పోనిచ్చారాయన. అయినా అది విడిచిపెట్టలేదు. క్షణంలో మీదపడి కుమ్మివేసేదే! అంతలోనే ఆయన ఆ మోటారు సైకిల్ పక్కనే ఉన్న ఒక పెద్ద చెరువులోకి పట్టించారు. పొట్టేలు ఆ చెరువు చుట్టు పది ప్రదక్షిణాలు చేసి పగ తీర్చుకోలేక వచ్చిన దారినే తిరిగి వెళ్ళిపోయింది! శ్రీ శాస్త్రిగారి జీవితంలో ఇది చాలా విచిత్రమయిన సంఘటన. ఇదే విధమయిన వైచిత్రి వారి కథానికలలో చాలా చోట్ల గోచరిస్తుంది.

ఈనాడు మన దేశంలో గొప్ప కథకుల కోసం వేళ్లు ముడవడం మొదలు పెడితే శివరామశాస్త్రిగారి పేరు మొట్టమొదటి కోవలోనే స్ఫురిస్తుంది.

కవీంద్ర ఘటాపంచాననుల శిష్య పరంపరలో శివరామశాస్త్రి మీనుమిగిలిన వ్యాకరణ విద్వాంసులు. ప్రాచ్య పాశ్చాత్య సారస్వతాలు, శాస్త్రాలు ఆమూలాగ్రంగా ఆకళించుకొన్న మనిషి. సాహితీపరులలో నిశితమయిన శాస్త్రీయదృక్పథం కలవారు చాలా అరుదు. కాని వీరి తీరు వేరు. ఖగోళశాస్త్రం మొదలుకొని కర్మమీమాంసా ప్రస్థానం వరకు శివరామశాస్త్రి తరిచి చూడని విషయమే లేదు.

శాస్త్రిగారిది నిండైన విగ్రహం. పండు తమలపాకువంటి శరీరచ్ఛాయ. కొందరు సాహితీవ్రతులు 'కట్టెలు కొట్టేవారేమో!' అనిపిస్తారు. కాని, శివరామశాస్త్రి ముమ్మూర్తులా సారస్వత చక్రవర్తిలా సాక్షాత్కరిస్తారు.

శ్రీ వేలూరి జీవితంలో కొన్ని గొప్ప అదృష్టాలు కలిసి వచ్చాయి. వారికెప్పుడు ఎక్కడో ఒకచోట దప్పిక్కి చేరి చాకిరీ చెయ్యవలసిన దురవస్థ పట్టలేదు. ఆపైన పుట్టినచోట చల్లని పల్లెపట్టులో పెద్ద భాండాగారంలో నిరంతరాయంగా సారస్వత వ్యాసంగం కొనసాగింది. శతావధాన మల్లసంగ్రామంలో చెళ్ళపిళ్ళ కవిముఖులచే 'సెహబాస్' అని మెప్పుపొందగల కవితా చాతురి వారికి చిన్ననాడే అలవడింది. శ్రమపడి ఏర్చి కూర్చిన పుస్తక భాండాగారం అగ్నిహోత్ర జ్వాలలో ఆహుతి అయినప్పుడాయనలో పెల్లుబికిన ఖండకృతి చదివి కంట నీరుపెట్టని వారుండరు. ఇలాంటివే మరి కొన్ని ఖండకావ్యాలుదాహరించవచ్చును.

అయితే వారి కథా కథననైపుణి అనితర

(64-వ పేజీ చూడండి)



# వనితాలోకం రచనల పోటీలో మొదటి బహుమతి (రూ. 50/-) పొందిన వ్యాసం

రచన : పాలూరి సుబ్బలక్ష్మి (ఏలూరు)

వివాహం జీవితంలో ముఖ్యమైన ఘట్టం. దీనితో ఒంటరి జీవితానికి స్వస్తి చెప్పి రెండవ వారితో కలిసి ఒకరికొకరు కష్టంలోనూ సుఖంలోనూ తోడు నీడగా అండదండగా జీవించడం ప్రారంభమవుతుంది. చెట్టుకొమ్మమీద కూర్చుని గుసగుసలాడే గువ్వలజంట చూడముచ్చటవుతుంది. అన్యోన్యంగా ఆడూ తోడూ కలిగి కలిసి మెలిసి తిరుగాడే దంపతులు వెన్నెలపన్నీరు వెద జల్లుతూవుంటారు. ఒక దృష్టితో చూస్తే ప్రేమకలిగి పొరపొచ్చాలు లేకుండా భార్యభర్తలు కలిసిమెలిసి సుఖజీవనము చేయుటమే జీవితపరమావధి అనిపిస్తుంది. ఇట్టి జీవనము ఒండొరులపై ప్రేమవున్నప్పుడే సాధ్యం. ప్రేమలేని జీవితం సారంలేని చెరకుపిప్పివంటిది.

స్త్రీ పురుషులకు ఒకరిపై నొకరికి ఆకర్షణ వుండడం సహజం. యుక్త వయస్సు వచ్చేటప్పటికి ఎవరూ నేర్పకుండానే పుట్టుకొస్తుంది. ఈ ఆకర్షణే ఒక ప్రత్యేకవ్యక్తిపై నిలబడుతుంది. అప్పుడతడు అందరిలోను వేరై తన ప్రత్యేకుడవుతాడు. అతనిలో ఇతరులలో కనపడని మెరుగులు కనిపిస్తాయి. అతనితో కలిసి జీవించడమే ధన్యమని తెలుస్తుంది. ఇట్టిస్థితి నే ప్రేమఅంటారు.

ప్రేమవ్యక్తికి సంబంధించినది. వివాహం సంఘానికి సంబంధించినది. పెండ్లి అనేదిసంఘం జంటపైవేసే ఆమోదముద్ర. వివాహంకాని జంటను సంఘం గుర్తించదు. పైపెచ్చు వారిని కాకులు పొడిచినట్లు పొడుస్తుంది. వారి ప్రేమ ఎంత పవిత్రమైనదైనా దాని దృష్టిలో అది నీచమే. ప్రేమ అడ్డులేని ప్రవాహం. వివాహం ప్రేమప్రవాహాన్ని పరవళ్ళు త్రొక్కకుండా గమ్యాన్ని చేర్చేయేటిగట్టు.

వివాహవ్యవస్థ అన్ని దేశాల్లోనూ అన్ని జాతుల్లోనూ వుంది. అందరూ పెళ్ళికి ప్రేమ ముఖ్యమని నిరాటంకంగా ఒప్పుకున్నదే. మనలోగూడా పెళ్లిలో వధువు గౌరీపూజ చెయ్యడం ముఖ్యాచారం. గౌరీదేవి తన తల్లిదండ్రుల నెదిరించి స్మశానాల్లో బూడిద పూసుకొని కపాలం చేతబట్టి భిక్షాటన చేసే శివుణ్ణి పెళ్ళాడతానని దీక్షపూనింది. ఇక ఆ శివుడో-మనస్సు చలింప చేశాడని మన్మథుణ్ణి మూడో నేత్రంతో బుగ్గిపాలు చేసిన ఘనుడు. ఇది పనిగాదని పట్టుదలతో తపస్సుచేసి తనపంతం నెగ్గించుకుంది. ఇట్టి గౌరి భారతస్త్రీ ఆరాధ్యదేవత. స్త్రీకి తాను వలచినవాణ్ణి పెళ్లాడడం జన్మహక్కు. ఇది ఇప్పటికి లాంఛనప్రాయంగామాత్రమే మిగిలింది. నిన్న మొన్నటివరకూ, పెళ్ళిళ్లు వధూవరుల ఇష్టానిష్టాలతో నిమిత్తంలేకుండా పెద్దల నిర్ణయప్రకారం జరిగేవి మనదేశంలో. ఆడదని చెప్పి తల్లిమాటకూడా నెగ్గే ఆస్కారముండేదికాదు. 'తాంబూలాలిచ్చాను తన్నుకు చావండి' అన్న అగ్నిహోత్రావధాని మాటలు ఇందుకునిదర్శనం.

కాలం మారింది. బొమ్మలపెళ్ళిళ్ళలాంటి బాల్యవివాహాలు ఇంచుమించు ఇక లేవనే చెప్పాలి. కనీసం పిల్లకు పిల్లవాణ్ణి పిల్లవాడికిపిల్లని చూపించకుండా చేసే పెళ్ళిళ్ళు లేవు. అయినా పెళ్ళికూతురు సిగ్గుతో ఓమాటు

(22 వ పేజీ చూడండి)



## రెండవ బహుమతి (రూ. 50/-) పొందిన వ్యాసం

**రచన: జి. పద్మావతి**

పూర్వకాలంలో స్వయంవరాల పేరిట జరిగిన ప్రేమవివాహాలను అయితే మన పెద్దవారు ఆమోదించారు. ఆపైన వారి ధైర్యస్థైర్యాలను మెచ్చుకున్నారు. కాని ఆ ప్రేమవివాహాల్నే నేడు మన పెద్దలు ఆమోదించటం లేదు సరికదా, ముక్కు విరుస్తారు. దీనికి కారణమేమిటి? ఈ వివాహాలు వర్ణాంతర, శాఖాంతర వివాహాలకు దారి తీస్తాయనా, లేక సుఖాంతం కావనా? అయినా పూర్వం స్వయంవరాలు రాజకుటుంబాలలో జరిగేవి. కాని, ఇప్పుడు ఈ ప్రేమ వివాహాలు అన్ని తరగతుల వారిమధ్య జరుగుతున్నాయి. దీనికి కారణం, కాలంలో వచ్చిన మార్పా? లేక సంఘం మారిందా? లేక మనమే మారేమా? దీనికి మన పెద్దవాళ్లు చెప్పే జవాబు ఏమంటే 'ఆడవాళ్ల చదువులు వచ్చాక ఈ విడ్డూరాలన్నీ' అని.

మా రాధ తనక్లాసుమేటు మధుని పెండ్లిచేసుకుంటున్నట్టు (పెద్దల యిష్టంతోనే) ఉత్తరం రాస్తూ దాంతోనే శుభలేఖ పంపించింది. నా చేతిలో శుభలేఖచూసి మా అమ్మమ్మ "ఎక్కడనుంచే ఆ శుభలేఖ" అని అడిగింది. "గుంటూరులో మన పక్కనున్నవారి అమ్మాయి రాధదిఅమ్మమ్మా" అన్నాను. "ఏవరబ్బాయి కిస్తున్నారే" అని అడిగింది. "ఎవరోకాదు, వాళ్ళ క్లాసబ్బాయినే చేసుకుంటోంది" అన్నాను. "అవ్వవ్వ ఏమిటే, ప్రేమపెళ్ళా ఏమిటి, అయినాను ఈ ఆడవాళ్లకి చదువులొచ్చి పడ్డాక ఎన్ని అనర్థాలయినా జరుగుతున్నాయి. అయినా ఆ అబ్బాయి ఏకులస్థుడో" అంది మా అమ్మమ్మ. ఈరోజుల్లో పెద్దవాళ్ళ దృక్పథం ఇలాగే ఉంటుంది.

కాని ఒక విషయం మాత్రం నిజమేమో అనిపిస్తుంది. ఆడవారు మొగవారితో సమానంగా చదువుకోవటం, ఆపైన పరిస్థితులు, అవసరాలనిబట్టి ఉద్యోగం చేయటం జరుగుతోంది ఈరోజుల్లో. పూర్వం స్త్రీకి పురుషునికి అసలు సంబంధమే ఉండేదికాదు. కాని యిప్పుడు స్త్రీలు చదువుకోవాలంటే వీరికి ప్రత్యేకమైన విద్యాసంస్థలు అన్నిచోట్ల లేవు (ఉండడం కష్టం) అందుకోసం కో ఎడ్యుకేషను తప్పదు. అంటే చదువుకున్న వాళ్లంతా ప్రేమించి పెండ్లి చేసుకుంటున్నారు అనటం లేదు. కాని మొగవారితో మాట్లాడటం, ఒకరికొకరు కావలసినప్పుడు సహాయం చేయటం తప్పదు. అందువలన ఒకరిగూర్చి ఒకరు బాగా తెలుసుకోవటాని (మాట తీరు, స్వభావం) కి అవకాశాలు చాలా ఉన్నాయి. అందులోను ఏదో సంఘటన జరిగి వారిని మరింతదగ్గరకు తీసుకొస్తుంది (అంటే ఒకరి నొకరిగూర్చి తెలుసుకోవాలని అభిలాష కలగటం) ఆపైన యిద్దరూ యిష్టపడితే, చివరకు వివాహానికి దారితీస్తుంది.

అయితే స్త్రీ మగవారిలో అందం చూసా ధనం చూసా పదవి చూసా ప్రేమిస్తున్నది? దీనికి జవాబు చెప్పటం కష్టంకాని పురుషుడు కేవలం అందాన్ని ఒక్కదానినిచూసి ప్రేమించి పెండ్లి చేసుకుంటాడు. కాని స్త్రీ ఒక్క అందానికే ప్రథమస్థానం యివ్వదు. వెంటపడి వెకిలిగా తిరిగేవారిని అసలు యిష్టపడదు. ధనానికి లొంగిపోవచ్చు. కాని స్త్రీ ఎప్పుడూ (పదవిలో) సంస్కా

# ప్రేమ వివాహాలు

రంలో, చదువులో (కొన్నిచోట్ల ఇద్దరు ఎక్కువ పట్టుదల చూపించటంలేదు) కాని తనకంటె తక్కువవానిని ప్రేమించి పెండ్లిచేసుకోవటం జరగటంలేదు. డాక్టరు డాక్టరునే చేసుకుంటుంది. నర్సు డాక్టరునే చేసుకుంటుంది. కాని ఏ డాక్టరూ మేల్ నర్సుని చేసుకున్నట్లు వినలేదు. (అంటే చాలఅరుదు) దీనికి కారణం స్త్రీ తనతో సమానమైన వారితోనే తప్ప సంబంధం పెంచుకోడానికి యిష్టపడదో, లేకపోతే పురుషులు తమకంటె అన్నిటిలోను అధికంగాఉన్న స్త్రీలను చేసుకోటానికి యిష్టపడరో చెప్పడం కష్టం. కారణమేదైనా జరుగుతున్నదిమాత్రం పైన చెప్పినవిధంగా. స్త్రీ తనకి నచ్చినగుణాలు ఇతరులలో ఉంటే తప్పకుండా వారిని ప్రేమిస్తుందేమోనని పిస్తుంది. అటువంటి సమయంలో అవతలవారు డబ్బులో తనతో సరితూగ లేకపోయినా చదువు, ఉద్యోగం తను అంతస్థుకు తగినవైతే తప్పకుండా చేసుకుంటుంది. గుణానికి ఇచ్చిన విలువ స్త్రీ అందానికి ఇవ్వదేమో అని నా అభిప్రాయం. రాధ విషయం చెప్తాను. తండ్రికి ఒక్కర్తే కూతురు. తెలివైనది. చాలా చక్కగావుంటుంది. మితభాషిణి. ఎవరితోను ఎక్కువగా మాట్లాడదు (బాగా పరిచయం ఉంటేనేగాని) అటువంటి రాధ "మా క్లాసుమేటు మధుతో నా వివాహం నిశ్చయమైంది. లవ్ మారేజ్" అని వ్రాసింది. నాకు చాలా ఆశ్చర్యమైంది. అసలు రాధ కింత ధైర్యమెలా వచ్చిందా అని. నేను తనతో ఉన్నప్పుడు ఎన్నిసార్లు చెప్పింది 'మా క్లాసుమేట్సు అందరిలో మధు అని. ఒక అబ్బాయి ఉన్నాడు. ఎంత మంచివాడోను. క్లాసు ఫస్టు అతనిదే. చాలా 'రిజర్వుడు'గా ఉంటాడు. పాపం బీదవాడు." అని ఒకసారి మనిషిని చూపించింది. అంత అందగాడేమీ కాదు. అయితే రాధ అతనిలో ఏమి చూసి ప్రేమించింది అంటే నాకు మట్టుకు ఏమీ తోచటంలేదు. (కేవలం అతనిలో తనకు నచ్చిన ప్రవర్తన, గుణం ఉన్నాయి. మిగిలినవి ఏమి లేకపోయినా).

ప్రేమకు జాతి, మత, కుల భేదాలు లేవని అందరూ చెప్పే విషయమే. అసలు అన్నీ ఆలోచిస్తే ప్రేమించి పెండ్లి చేసుకోలేరేమో. అయితే జాతులు, కులాలు వేరైనప్పుడు అలవాట్లు, ఆచార వ్యవహారాలు, భోజనాదు (శాకాహారి, మాంసాహారి)లతో కూడ కొంచం వేరుగనే ఉంటాయి. అటువంటప్పుడు ఒకరి నొకరు బలవంత పెట్ట

కుండా, ఏం కావలిసే ఎవరి ఆచారాలను, అలవాట్లను వారుపాటించుకుంటే బాధలేదు. కాని పెళ్ళి చేసుకునేముందు. "అవన్నీ మా ప్రేమ ముందు లెక్కకేరావు" అని చేసుకొని తరువాత ఏడుస్తున్నా లాభం ఉండదు.

ఒక మాంసాహారి, శాకాహారి అయిన స్త్రీని చేసుకున్నట్లయితే యిద్దరికి కలిసే దెలాగ? ఆమెకోసం అతను తన జిహ్వని చంపుకో కలసిందేనా? లేకపోతే అతనితో పాటుఆమె తినగలుగుతుందా? అది అసంభవం. కాని నిజంగా చెప్పాలంటే అతనికి కావలిస్తే అతను పైన ఎక్కడయినా తినవచ్చు గాని యింట్లో భార్యని తయారుచేయమంటేచాలా కష్టం. ఇదెందుకు చెప్తున్నానంటే, మా తెలిసినవారమ్మాయి ఒక డాక్టరుని ప్రేమించి, (పెద్దల మద్దతుతోనే) ఒక మాంసాహారిని చేసుకుంది. పెండ్లయిన రెండు మూడు సంవత్సరాలు బాగానే ఉంది. ఇప్పుడు మాంసాహారపు వంటలన్నీ యింట్లోనే ఈవిడే తయారుచేయాలి. కాదంటే దెబ్బలు తినటం. యిప్పుడు నిజంగా ఏడుస్తుంది 'ఎందుకొచ్చిన పెళ్ళి యిది బాబూ" అని అందులో ముఖ్యంగా స్త్రీకి ప్రేమించిచేసుకున్నా, తల్లిదండ్రులు చేసినా పెళ్ళి, అత్తింటి ఆచారా

# ప్రేమ వివాహాలు

లను, భర్త యిష్టానిష్టాలనే ఎక్కువగా పాటించవలసి వస్తుంది (ముఖ్యంగా మన హిందూ దేశంలో) అటువంటపుడు మాంసాహారి అయిన స్త్రీ, శాకాహారి అయిన వానిని వివాహం చేసుకుంటే, యింటి నిష్టప్రకారం అన్ని వంటలూ చేయటానికి ఏ భర్త ఒప్పుకోడు. ఒప్పుకుంటాడు అనుకోవటంకూడ శుద్ధ తెలివితక్కువే.

అందువలన ముఖ్యంగా స్త్రీ ప్రేమించి పెండ్లిచేసుకునేటప్పుడు పైవిషయాలు ఆలోచించటం ముఖ్యం. ఎందుకంటే చిన్నప్పటినుంచి పుట్టి పెరిగిన అలవాట్లను చంపుకోవటం చాలాకష్టం. అవతలవారు సర్దుకుపోయేరకమైతే శాఖాంతరమైనా, వర్ణాంతరమైనా అంత బాధలేదు అనుకోవచ్చు.

అదికాకుండా పెద్దవాళ్ళతో ప్రమేయం లేకుండా, స్త్రీ తనమట్టుకు తనే ఎవరినో ప్రేమించి పెండ్లి చేసుకునేటపుడు అవతలవాళ్లను బాగా అర్థం చేసుకోవాలి. ఎందుకంటే వివాహాలు వర్ణాంతరమైతే అబ్బాయి తల్లిదండ్రులు (అమ్మాయి తల్లిదండ్రులు) ఒప్పుకోకపోవచ్చు పోని ఈ అబ్బాయికి వారిని ఒప్పించేశక్తి ఉన్నా లేక ఎదిరించే శక్తిఉన్నా ఫరవాలేదు అలాకాకుండా ఓ అమ్మాయిని చూడగనే బాగుంది, పెళ్ళిచేసుకోవాలనుకోవడం, ఆ అమ్మాయికి ఆలాగే చెప్పటం (పెద్దలమాట మరచిపోయి) ఆపైన ఆ అమ్మాయితో షికార్లు తిరగడం చెయ్యడం. కాని చివరకు పెళ్ళిమాట ఎత్తేటప్పటికి చెప్పాచెయ్యకుండా ఊరికెళ్ళి, తల్లిదండ్రులు చెప్పిన పిల్లను చేసుకొని రావటం. అంతా బాగానే ఉంది. కాని ఆ అమ్మాయి ఎంత బాధపడుతుందో ఆలోచించండి. అందులో స్త్రీకి మన సంఘంలో ఉన్న విలువవేరు, పురుషుడికి ఉన్న విలువ వేరు. అటువంటప్పుడు, ఎదుటివారిని బాగా అర్థంచేసుకొని నిజంగా ప్రేమిస్తున్నాడా, లేదా అవసరంవస్తే సంఘాన్ని కాని, పెద్దవాళ్ళను ఒప్పించైనా, ఎదిరించి అయినా (మంచిది కాదనుకోండి) తనని సుఖపెట్టగలడు అనుకున్నవానినే వివాహం చేసుకోవటం మంచిది. ఎంత ప్రేమ వివాహం అయినా తల్లిదండ్రుల చేతిమీదుగా, వారి సమ్మతిమీద జరిగితే అందరికీ సంతోషం.

ఈ కాలంలో ఎన్నోచోట్ల చూస్తున్నాం. కొడుకు పెండ్లయినా తల్లిదండ్రులు వెళ్ళకపోవటం. దానికి కారణం వర్ణాంతరమనీ (కట్నం లేదనీ), తమని కాదని వాడే చేసుకుంటున్నాడనీ చెప్తారు. ఏది ఏమయినా, కని పెంచి, పెద్ద చేసినందుకు, వారిని సంతోషపెట్టడం మన విధి.

ఇక పోతే ప్రేమించి చేసుకున్న పెళ్ళిళ్లు

సుఖాంతమేనా అని అంటే పెద్దలు చేసిన పెళ్ళిళ్ళలాగే కలకాలం చిలకాగోరింకల్లాగే ఉంటాయా (నిజంకాదు సుమండోయ్) అని. ఒకరినొకరు చాలాకాలం అర్థంచేసుకున్నాక. అందులోను కొంచెం పెద్దవాళ్ళ సమ్మతితో చేసుకున్న పెళ్ళిళ్ళు సౌఖ్యదాయకంగానే ఉంటున్నాయి. కాని తెలిసీ తెలియని జ్ఞానంలో ఎవరో ప్రేమించాడని, పెండ్లి చేసుకుంటానని చెప్పాడని, యిల్లు వాకిలి వదిలి వెళ్ళి అష్టకష్టాలు పడ్డవారిని చాలామందిని చూస్తున్నాం. అందుకోసం, స్త్రీ వివాహం చేసుకునే ముందు పైన చెప్పినవన్నీ ఆలోచించి మరీ నిశ్చయానికి రావాలి.

మొత్తానికి స్త్రీ తనవిలువను తెలుసుకొని, ప్రవర్తించినప్పుడు ఏ దాంపత్యమైనా సుఖంగానే ఉంటుంది. ప్రేమవివాహాలు ఈ రోజుల్లో చాలా ఎక్కువ అవుతున్నాయి. సౌఖ్యదాయకంగాకూడా ఉంటున్నాయి. కొన్ని కొన్ని ఇబ్బందులున్నాయనుకోండి.



# ★ ప్రేమవివాహాలు ★

(16-వ పేజీ తరువాయి)

కాబోయే వరుణ్ణి చూచి వచ్చిండీ లేనిది చెప్పినమాట తీసుకుని నిర్ణయించే పెళ్ళిళ్ళు ఎంతవరకూ ప్రేమవివాహాలో చెప్ప లేము.

ఇటీవల ఈడువచ్చిన స్త్రీలూ పురుషులూ ఒకచోట కలిసి చదువుకోవడం, తరువాత ఒకే ఆఫీసులో కలిసి పని చెయ్యడమూ సంభవిస్తోంది. స్త్రీ పురుషుని కన్నెత్తిచూసినా, మాట్లాడినా కులటగా భావించే రోజులు గతించాయనే చెప్పాలి. ఆయా సందర్భాల్లో ఒకరిపై నొకరికి ప్రేమకలగడం వాళ్ళు పెళ్లి చేసుకోడానికి సిద్ధపడడం జరుగుతోంది. ఇట్టి సావకాశాలు ప్రేమ వివాహాలకు దారితీసి క్రమంగా బాధ్యత తల్లిదండ్రులపైనుండి పిల్లలమీద పడుతోంది. కన్ను తెరుచుకు ప్రవర్తిస్తే యీ మార్పు అభివృద్ధికరమైనది అనే చెప్పవచ్చు. ఇట్టి పరిస్థితులలో ప్రేమవివాహాలు మంచివా కావా? జీవితాన్ని సుఖమయం చేస్తాయా లేక కష్టాలపాలుచేస్తాయా? అనే ప్రస్తుత ప్రశ్నకు తావిచ్చాయి.

ప్రేమించడంలో సాధారణంగా స్త్రీదే పై చెయ్యి. తాను ప్రేమించినా తనపై ప్రేమలేని స్త్రీని పెళ్ళాడదలచ పురుషుడుండడు. అయితే స్త్రీ యెట్టివాణ్ణి ప్రేమిస్తుంది? దానికేమైనా సూత్రాలున్నాయా? ఫలానా లక్షణాలు కలవాణ్ణి మాత్రము స్త్రీ ఎన్నుకుంటుందని చెప్పే శాస్త్రమేమన్నా వుందా? అంటే అట్టివేమీ లేవనే చెప్పాలి. జీవితమెంత వైవిధ్యమైందో అంత జటిలమైందీ ప్రేమ. మనిషినిపోలిన మనిషి వుండవచ్చే ఒకరి ప్రేమను పోలిన ప్రేమలక్షణాలు మరొకరిలో వుండవు. ప్రేమ వ్యక్తిగతానుభవము గనుక వారివారి అభిరుచులపై ఆధారపడి వుంటుంది.

స్త్రీ ప్రేమించడానికి ముఖ్యమైనది అందమా, ధనమా, బలమా, గుణమా, లేక హోదావా? ఇందులో అన్నీనా, లేకపోతే యే కొన్నైనా అనే ప్రశ్నలకు సమాధానం ఇదమిద్ధమని చెప్పడం కష్టం. అందము మొదలైన వాటికి ఒక అంతూ దరీ లేదు. తాడి తన్నే వాడికి తల తన్నే వాడుంటాడని ఆయా విషయాల్లో ఒకరినిమించి మరొకరు వుంటూవుంటారు. నిక్కచ్చి అయిన నిర్ణీతప్రమాణాలు వీటికి వుండవు. అతి పేదకుటుంబములో పుట్టిన వాళ్లకు సామాన్యులు భాగ్యవంతులుగా కనిపించవచ్చు. లక్షాధికారి బిడ్డకు భుక్తికి లోటులేనివాడు నిరుపేదగానూ కనుపించవచ్చు.

ఎదుటివ్యక్తిపై ప్రేమ ఫలానా అందాన్ని బట్టిగానీ, మరితరమైనదాన్ని బట్టిగానీ కలుగుతుందని చెప్పలేము. అందము ఎలా కనుముక్కుతీరు నడక మొదలైన అనేక అంశాలపై ఆధారపడిన సమగ్రఫలితమో అలాగే ప్రేమించడం కూడా అన్ని అంశాల యొక్క సమగ్ర పరిణామం. ఆమాటకొస్తే ప్రేమించే వ్యక్తికే ఎదుటివానిలో దేన్ని చూసి ప్రేమిస్తోందో చెప్పడం కష్టం. ప్రేమింపబడ్డవానిలో అందము ఎక్కువగా వుంటే అందాన్నిబట్టిఅనీ, ధనము ఎక్కువగా వుంటే ధనాన్నిబట్టి అనీ నిర్ణయానికి వస్తూవుంటారు కాని ఇది సరియైనది కాదు.



మైసూరు దసరా ఏనుగ










‘అందము కొరుక్కు తింటామా’ అని సాధారణంగా తేలిగ్గా తీసిపారేస్తూంటారు. అందమే ప్రేమ విషయంలో ముఖ్యాకర్షణ. సులభంగా ఎదుటివారిని ఇది ఆకర్షిస్తుంది. అందంకంటే గుణం ప్రధానమన్నా పరిచయముంటేగానీ అనుభవానికి రాకపోవడం మూలాన తొలిచూపులోనే ఆకర్షించే అందపు ప్రభావము గుణంకంటే బలవత్తరమైంది. మసిపాతను కట్టినది మాణిక్యమైనా మరుగుపడిపోతుంది. అందవిహీనత ప్రేమ విషయంలో తీరనిలోటే అనిపిస్తుంది. కానీ యీ అందం వ్యక్తుల అభిరుచులపై ఆధారపడి వుంటుంది. ఒకరికి నచ్చనివ్యక్తి మరొకరికి నచ్చడం ఈ కారణంవల్లనే.

ఎక్కడో చదివినజ్ఞాపకం. ఇద్దరు ఆడవాళ్ళు బస్సు ప్రయాణంలో తారసపడతారు. ఒకరితో కొకరు కబుర్లలో తమ విషయాలు కలబోసుకుంటారు ఇద్దరూ తమ తమ భర్తలు విసిగించేత పుట్టిళ్ళకు ప్రయాణం కట్టినవాళ్ళే. కానీ భర్తలు విసిగడానికి గల కారణాలు వేరు. ఒకామె లావుగా వుందనీ; మరొకామె సన్నంగా పుల్లలా వుందనీ, కథ కల్పితం కావచ్చు; కానీ నమ్మడానికి వీలైన విషయమే.

ఇంక ధనంమాట! ‘ధనమూల మిదంజగత్’ దీని ప్రభావం వర్ణింపనలవికానిది. అందులో ఈ కాలంలో మరీనీ. పైకి చెప్పుకోడానికి సిగ్గుపడ్డా ఇది వివాహ విషయంలో ప్రబలమైన కారణ మౌతుంది. ప్రేయసీప్రియులు ఊహాలోకంలో విహరించినా వాళ్ళకాళ్ళు భూమిని విడువలేవు. దారిద్ర్యము తల్లిప్రేమనే నశింపజేసి పిల్లనోట్లోనిముద్ద సైతం తనప్రాణం నిలుపుకోడానికి లాక్కునేట్లు చేస్తుంది. ఇతరాకర్షణలు ఎంతో బలమైనవైతేతప్ప ప్రేమ యీ పెద్దపాముని దాటడం కష్టం.

హోదా, ఉద్యోగము, అంతస్తు మొదలైనవి ఎక్కడో తప్ప కలయికకే అడ్డు వస్తాయి. తమకన్న హోదా తక్కువవారిపై సాధారణంగా స్త్రీకి తలపేపోదు. కానీ ఇతరాకర్షణలు బలమైనవాడు ఇది అంత అడ్డుపెడుతుందనీ చెప్పలేము.

ఇవేకాకుండా చనిపోయిన తన అక్కగారి పిల్లలకు లోటులేకుండా చేద్దామని వారిపైగల ప్రేమకారణంగా పెండ్లాడే సందర్భాలూ వుంటాయి. ఒకోసారి ఎదుటి

వాళ్ళ జీవితాలను బాగుచేద్దామనో లేక తాను ప్రేమించే విధానం మామూలుకంటే విలక్షణంగా వుండాలనే ఊహతోనో ప్రేమించడం జరుగుతూవుంటుంది. ఇట్టి విషయాలే సినీమాకథలకు నవలలకు ముడిసరుకు.

ప్రేమవివాహం సౌఖ్యవంత మవుతుందా కాదా? అంటే అది ఆయావ్యక్తులపై ఆధారపడివుంటుందని చెప్పాలి. ప్రేమించి పెండ్లాడడానికి కారణాలేవైనా వివాహజీవితం 'నిమ్మకు నీరెత్తినట్లు' సాఫీగాను ఒడిదుడుకులు లేకుండాను సాగడానికి గుణం ముఖ్యమౌతుంది. ఒక్కొక్కప్పుడు ప్రేమకు దోహదమొనర్చిన అందచందాలు మొదలైనవి వివాహజీవితంలో దుఃఖకారణాలు కావచ్చు. అట్టిసమయంలోనూ మరి ఎల్లప్పుడూకూడా ఓర్పు, త్యాగము, పరస్పరంసానుభూతి వారిరువురిలోనూ వుంటే అట్టి ప్రమాదాలను మంచువిసగొట్టినట్లు విడగొట్టడమేకాకుండా ఒకరికొకరి మరింత సన్నిహితులై దృఢమైన ప్రేమ గలిగి వుండడం సంభవమవుతుంది. ప్రేమ వున్నచోటే ప్రతీ చిన్నపొరపాటు దుఃఖాన్ని కలిగిస్తుంది. దీపం వెంబడి క్రీనీడలా కన్నీరు ప్రేయసీప్రియులను ఆశ్రయించుకొని వుంటుంది. ప్రేమ యేపుగా పెరగడానికి కన్నీరవసరమేమో ననిపిస్తుంది. పుటము పెట్టడమువల్ల బంగారం శుద్ధమైనట్లు కష్టాలవల్ల ప్రేమ కళంకరహితమై దినదినాభివృద్ధి చెందుతుంది. ఈ సందర్భంలో నిజమైనభక్తునకు ఎదురయ్యే కష్టాలు తలపుకువస్తాయి.

నిమిష నిమిషానికి మారే బాహ్యాకర్షణల్ని కామాన్ని స్వచ్ఛమైన ప్రేమఅని భ్రమించే ప్రమాదము ఎంతైనావుంది. జీవితంలో ఒక్కొక్కసమయంలో ఇది స్వచ్ఛమైన ప్రేములాకనిపించి బురదలోపడేట్టుచేస్తుంది అందుచేత తొందరపడి తరవాత విచారించి విడాకులకు సిద్ధమయ్యేకంటే కను గలిగి ప్రవర్తించి నిదానంతో ప్రేమకు కామానికి గల తేడా తెలిసికొని ప్రవర్తించి జీవితం దిద్దుకోవడం ఎంతైనా అవసరం. ఇందులో పొరబాటు పడ్డామంటే జీవితాంతమూ సరిదిద్దుకోవడానికి వీలులేనిది. నిప్పుతో చెలగాటంవంటిది. అందుచేత ఇటువిషయాలలో వివేకం ఆలోచనాగలిగి మసలడం సోదరీమణులకు ఎంతైనా అవసరం. ఎంతకాలం మారినా సంఘం మగవాళ్ళ తప్పులను క్షమించినట్లు ఆడవాళ్ళ తప్పులను క్షమించదు.

అంతవరకూ మారలేదు మన సంఘం. ★

ప్రత్యేక **త్రిగుణాచర్యతో**

గూడియున్న **మెక్లీన్స్**

**పెరాక్సయిడ్ టూత్ పేస్టు**



1

**చాలా బాగుగా**
*** శుభ్రపరచును!**

ప్రత్యేకంగా మెక్లీన్సులోనున్న 'సైపాయిర్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే – మురికివి క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్సు మీపళ్లను బాగుగా శుభ్రపరచును.



2

**చాలా బాగుగా**
*** తెలుపుజేయును!**

మెక్లీన్సులోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గం వికృతమైన దాగులను, గారపట్టిన రంగును తొలగించును – అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా జేయును.




3

*****
**బాగుగా కాపాడును!**

మీరు మెక్లీన్సును స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని రాజాదనమును కనుగొనండి. ఇది పనుచిగుళ్లను ఉత్తేజ పరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును.

*ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన. కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది!*

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంతమైన పళ్లకోసం.. నేడే మెక్లీన్సు కొనండి!**

MTY-45

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

[గత వారం తరువాయి]

శివరాం రాగానే మర్యాదగా ఆహ్వానించాడు పరమహంస. తక్షణం ఒక వేడి కాఫీ, సిగరెట్టు తెప్పించాడు. తన ట్రంకుపెట్టెలోంచి పురాతన కాగితాల గ్రంథం, ఒక బొమ్మల ఆల్బం బయటికి తీశాడు. గ్రంథంలో పూర్వకాలంలో తన ప్రతిభ గురించి వివిధ ప్రముఖులు వ్రాసిన వ్యాసాలు, వివిధ పత్రికాధిపతులు చేసిన పొగడ్తలు, చిరిగి, నలిగి కుట్టబడి ఉన్నాయి. వివిధ ప్రాంతాలలో తాను చూపిన నటనాకౌశలం ప్రతిబింబించే పాత్రల స్వరూపాలు, సహాయం చేసిన నటీవర్గం, తను నిర్మించిన వివిధ రకాల రంగస్థలాలు, స్నేహం చేసుకున్న ప్రముఖ సినీ నటులు, మొదలయిన ఫోటోలు ఆల్బంలో కనిపించాయి. ఆ పురాతన జీవిత చిహ్నాల ప్రాతిపదికగా వయసుడిగిన ముసలితనం వర్తమానంలో పరమహంస జీవితానికి ఆధారాలు ఏర్పరచుకుని స్వీకరించిన తన మనుగడకు తగినపని కల్పిస్తూంటాడు. శివరాంముందుకూడా పరమహంస తన సహజ ఉపన్యాసం ఒకటి యిచ్చేశాడు.

కాలం మార్పులో ప్రజాభిరుచి అనుసరించి, కళ రీతులకు విలువలుకూడా మారుతూంటాయి. పరమహంస పాత చరిత్ర విలువలు ప్రస్తుతంలో ప్రజాదరణ పొందవనే దృఢనమ్మకం శివరాంకు కలిగినా అతని కార్యక్రమాలలో మంచితనం పేగుమీద తగిన సహకారం ఇవ్వడంలో అనర్థకాలున్నట్లు కనిపించలేదు. పరమహంస ఉపన్యాసం విని లోపల ఆనందించినా పైకి మాత్రం మౌనంగా ఆసక్తి కనపరచేడు శివరాం.

'భాణం' అనే నాటకంలో దొంగపాత్ర ధరించవలసినదని ఆ పాత్ర సంభాషణల కాగితం శివరాంకు అందించేడు పరమహంస. ఈ నాటికలో మూడే పాత్రలుంటాయని, తక్కిన రెండు పాత్రలూ రాణి, తను నిర్వహిస్తానని తెలియజేశాడు పరమహంస, రిహార్సల్సు జరపడానికి రాణి రాకకై నిరీక్షిస్తున్నట్లు పరమహంస ప్రవర్తన ప్రతిబింబిస్తోంది.

పరమహంస సంభాషణ సాగించేడు రాణి వచ్చేలోపుగా కాలక్షేపం చెయ్యాలని. తన స్వంతవూరులో కుటుంబాన్ని అట్టేపెట్టి తిరుగుతున్నా, భార్యాపిల్లలమీద తనకున్న మక్కువ చాలా కాలానికి యింటికి వచ్చినా అమాయకమైన మందస్మితంతో అనురాగంతో ఆహ్వానించే తన భార్య, తన జీవితంలో కలిసిన విచిత్రవ్యక్తులు, తాను ప్రతినిత్యం జీవితంలో కనపరచిన నిజాయితీ ఏకరువుపెట్టేడు పరమహంస. ఒకరోజు హోటల్లో స్నానాలగదిలో తనకు వెయ్యి రూపాయల కవరు దొరికిందని, ఆ కవరు యజమాని బహుశా తనకుముందు స్నానం చేసిన మరొక ఆసామీ అయివుంటాడని నిశ్చయించి, అతనికోసం వెతికి, తిన్నగా రైలుస్టేషనుదాకా వెళ్లి అతను నోట్లకవరు కనిపించక కంగారుగా వెనక్కు వస్తూంటే పట్టుకుని, ధనం యిస్తే, సంతోషమైనా వ్యక్తపరచకుండా అభినందనలైనా చెప్పకుండా, కృతజ్ఞతయైనా వెల్లడించకుండా, ఆ ఆసామీ మూతి ముడుచుకుని కోపంగా ఎల్లా వెళ్ళిపోయినది నటించి చూపాడు పరమహంస. తన నాటకాల్లో సహాయం చేసిన నటీమణులు యౌవనోద్రేకాలలో తప్పదారులు త్రొక్కి పాడైపోతుంటే, సంహితులు మంచిచెడులు చెప్పి, వారిని పవిత్రులుగా చేసిన వైనము వివరించాడు పరమహంస. తనతో కలిసిమెలిసి తిరిగిన స్నేహితులలో స్త్రీపురుషులు ఒండొరులు ప్రేమించుకుంటే, తాను వారికి కల్పించిన అవకాశాలు, తద్వారా పవిత్రదంపతులుగా వారిని చివరకు మార్చి జరిపించిన వివాహతతంగాలు సవిస్తరంగా సెలవిచ్చాడు పరమహంస. తన జీవితమంతా వేదాంతపూరితమై, నిష్కామంగా, నిర్వాగంగా గడిచిందని వక్కాణించి ఒక చిరునవ్వు ప్రశాంతంగా నవ్వి హఠాత్తుగా అయిదునిమిషాలు మౌనంవహించాడు పరమహంస.

ఆ సమయంలో గదిలోకి రాణి ప్రవేశించింది. నీలం సిల్కు చీర, ఎర్రజాకెట్టు, ఎత్తు మడమలు, పెదాలకు రంగు, ముఖానికి పౌడరు, వంగిన కనుబొమ్మలమధ్య ఎర్రని తిలకం, ఒయ్యారపు నడక-చేతిలో వేనిటీ బాగ్, కాంతివంతమైన కళ్ళతో నిశితంగా చూస్తూ మెల్లిగా గదిలో అడుగుపెట్టింది రాణి. ప్రవేశించి పరమహంసకు నమస్కరించింది శిష్యురాలిలా. ప్రక్కనే కూర్చున్న శివరాంను పూర్తిగా చూడడం మానేసింది, పురుషులతో మాట్లాడడం తనకు చాలా కొత్త అయినట్లు.

పరమహంస శివరాంను పరిచయం చేశాడు రాణికి. రాణి మందస్మితంగా కంగారుగా గబుక్కున నమస్కరించి ఊరుకుంది. శివరాం మనస్సులో ఏదో భూకంపం విజృంభించి, అతన్ని ఒక్కక్షణం కుదిపివేసింది. రాజారావు చక్రవర్తులతో ఒకరోజు చార్మినార్ వెనకాల ఇంట్లకు వెళ్ళినపుడు యీమెను చూచినట్లు బాగాగుర్తు. ఆకారంలోని మార్పుతప్పిస్తే తక్కిన అవయవభంగిమలన్నీ తన అపురూపలయిన శారద ఆకృతికి సన్నిహితంగా అగుపిస్తున్నాయి. తనవైపు నిర్లక్ష్యంగా చూసి ఊరుకున్న రాణి తనకు ఏవిధంగానూ సన్నిహితురాలు కాకపోయినట్లు నిర్ధారణ అయినా, హృదయంలో పొంగిపోయిన సహజభావాలతో కూడిన ఆప్యాయత రాణిపై ఉద్భవించింది శివరాంకు.

'ఏమండీ నేను ఉద్యోగంలో చేరాను నిన్నటినుంచి!' నవ్వుతూ కనుబొమలు ఎగరవేసింది రాణి.

పరమహంస ఆశ్చర్యంగా ముఖం చిట్లించాడు.

'రామనరసుగారే మళ్ళీ పిలిచి ఉద్యోగం యిచ్చారు!'

'జాగ్రత్త! మళ్ళీ మూర్తిని కొట్టగలవు!' పరమహంస చలాకీగా నవ్వాడు.

'మూర్తి మా ఆఫీసు వదిలివేశాడు. మద్రాసులో ఏదో కంపెనీలో పెద్ద ఉద్యోగం అతనికి యిప్పించారు, రామనరసుగారు!'

ఆ సంభాషణలోని అంతరార్థం రాణి ఎవరినో కొట్టినట్లు స్ఫురించింది శివరాంకు. ఎందుకు కొట్టిందో, సంగతి ఏమిటో అగమ్యంగావుంది శివరాంకు. ఉద్యోగం చేస్తున్న రాణి, చార్మినార్ వెనకాల కనిపించిన స్త్రీ బహుశా వేరు అని నిశ్చయించుకున్నాడు శివరాం. ఒక మనిషిని పోలిన మనుష్యులు ఉండడంలో విపరీతం లేదని సర్దుకున్నాడు శివరాం.

నాటకం తీశారు చదవడానికి. పరమహంస నాటకం అంతా వివిధపాత్రల అభినయం చేసి రాణికి, శివరాంకు విశదపరిచాడు.

స్త్రీగా తాను ధరించవలసిన పాత్ర కూడ పరమహంస తనముసలి నాటకంలో నటిస్తూ చూపిస్తూంటే రాణి నవ్వు ఆపుకోలేక పోయింది. అమాయకంగా కలకల నవ్వింది. శివరాంకూడా ఆ నవ్వుల్లో శ్రుతికలిపేడు.

పాత్రల అభినయంలో లీనమయి, సహజమైన మానసముద్రలు సహజంగానే రాణీ, శివరాంకూడా సరదాగా మాట్లాడుకో సాగారు.

వేనిటీ బాగ్‌లోంచి వేయించిన శనగపప్పు తీసింది రాణి. శివరాంకు, పరమహంసకు కొద్దిగా చేతిలో పోసింది.

'చంటిపిల్లలా సెనగపప్పు తినడంఏమిటే!' నవ్వాడు పరమహంస.

'ఏమండీ, నేను చంటి పిల్లలా వేషం వెయ్యాలనుందండీ!' కనుబొమలు ఎగరేస్తూ అడిగింది రాణి.

'ఆఁ! రంగస్థలంమీద కాళ్ళ చేతులతో పిల్లిలా ప్రాకుతేసరి! అప్పుడప్పుడు దొర్లుతూ ఏడ్వాలి!' శివరాం చంటిపిల్ల వేషానికి [illegible] చేశాడు.

'అప్పుడు నీవు తల్లిగా నేను ఆడవేషం వెయ్యాలి!' నవ్వాడు పరమహంస.

'ఎలాగా ఉంటుంది కదూ!' కలకల నవ్వింది రాణి. రాణి నాటకంలో తన భార్యగా నటిస్తుందనీ, భార్యాభర్తలు రాత్రి నిద్రపోయిన సమయంలో దొంగలా వచ్చి నటించి భయపెట్టాలని శివరాంకు విశదీకరించాడు పరమహంస శివరాంకు. భయపెట్టే భంగిమలు ముఖంలో ప్రదర్శించాడు.

'ఏమిటండి, మీ నటన అంతా ఉత్తి డొక్కులా ఉంది!...నాకసలు భయం వేయటమే లేదు!' నవ్వుతూ అంది రాణి.

"నువ్వు భయపడినట్లు నటించు" పరమహంస దర్శకుడి ధోరణిలో కేకలేశాడు.

"నాకు ఎవన్నా భయంలేదండీ ..ఎలా భయపడేది" మళ్ళీ నవ్వింది రాణి.

"యీ పద్ధతిలో మనం నాటకం వెయ్యలేం రాణీ" పరమహంస మూతి ముడిచాడు.

ఆఁ అదికాదండి! మీముందు ఎలా భయపడగలను. రంగస్థలం మీద బాగా భయపడిపోతాను!... ఊఁ—మీరు భయపెట్టండి శివరాంగారు" సన్నగా నవ్వింది పెదాలు బిగపట్టుకుంటూ.

శివరాం దొంగవేషంలో వచ్చి చెయ్యవలసిన వివిధ అటహాస నటనలు చేసి చేతులు విసిరాడు ఒకపాజులో బల్లమీద రాణి పెట్టుకున్న వేనిటీబేగ్ శివరాం చేతికి తగిలి క్రింద పడిపోయింది. రబ్బరు బేగ్ నేలమీద వాలి త్రుళ్ళిపడింది.

"అయ్యయ్యో! నన్ను కాకపోయినా మా అబ్బాయిని భయపెట్టేశారండి!" అంటూ ఒగగా కోపంగా శివరాం వైపు చూసింది రాణి.

దుమ్ము దులుపుకుని, బేగ్ పైకితీసి పట్టుకుంది రాణి.

"మీ అబ్బాయి ఎవరండి" శివరాం ప్రశ్నించాడు అందులోని హాస్యం తెలుసుకోవాలని.

"చూడలేదు మీరూ..." అంటూ బేగ్‌లోంచి చిటికెన వేలంత చిన్న రబ్బరు బొమ్మతీసి శివరాం చేతిలో పెట్టింది.

శివరాం ఆ రబ్బరుబొమ్మను చూసి నవ్వు ఆపుకోలేక పోయాడు. అతన్ని నవ్వించానన్న సంతృప్తితో మందస్మితం చేసింది రాణి కులుకుతూ.

"మీరంత గట్టిగా నవ్వితే మా అబ్బాయికి అవమానం కదండీ..."అంటూ రాణి రబ్బరు బొమ్మ వేనిటీ బాగ్‌లో పెట్టేసింది.

రాణి ఛలోక్తులకు శివరాం ముగ్ధుడై పోయాడు.

'రాణి మాటల్లో ఏదో గారడీ ఉందండీ!' పరమహంస మత్తుగా మందస్మితం చేశాడు శివరాం వైపు.

రాత్రి ఎనిమిదిగంటలయింది.

పరమహంస బలవంతంపై రాణి, శివరాం హోటల్లోనే భోంచేశారు. తాంబూలాలు వారికి అందించి బస్సుస్టాండుదాకా సాగనంపాడు పరమహంస.

"మీరెక్కడికి వెళ్ళాలి!" రాణి ప్రశ్నించింది అతని బస వివరాలు తెలుసుకోవాలని.

"సికింద్రాబాదు"

"అంతదూరం వెళ్ళాలా ఇప్పుడు?..." ఆశ్చర్యంగా ముఖం చిట్లించి అరచెయ్యి వక్షంమీద వేసుకుని, కళ్లు పెద్దవిచేసింది రాణి.

"మీరు."

"కోఠీకి!"

"చాలాదగ్గరే ఉందన్నమాట మీయిల్లు!"

"ఒకసారి మా ఇంటికి రాకూడదండీ!" చిలిపిగా సాగదీసుకుంటూ రాణి అడిగింది.

"ఈసారి ఎప్పుడైనా వస్తా!" నవ్వాడు శివరాం.

"పోనీ, మీరు నన్ను మా ఇంటిదగ్గర దిగబెట్టి వెళ్ళిపోకూడదూ...మీకు ఏమీ ఇబ్బంది..." నసిగింది రాణి.

నగరంలో నాగరిక స్త్రీలు రాత్రికూడా పురుష సహాయంలేకుండా నిర్భయంగా కార్యక్రమాలు నిర్వహించుకుని వెళ్ళిపోతూండడం మామూలైనా, అడిగిన స్త్రీకి సహాయం చెయ్యడం మర్యాద అని శివరాం ఒప్పుకున్నాడు ఆమెను ఇంటిదగ్గర దిగబెట్టడానికి.

దగ్గరే కనుక, బస్సుమాని నడిచి పోవచ్చునంది రాణి.

తాము క్రైస్తవులమనీ, కోఠీప్రక్కనే సందులో ఉంటున్నామనీ, వీలైనప్పుడు తప్పకుండా తమ యింటికి వస్తూండమనీ

# ★ అన్వేషణ ★

చనువుగా మాట్లాడింది రాణి. నగరం వచ్చేక అంత చనువు చూపించిన నాగరిక నాజూకు యౌవన స్త్రీ, బాహ్యవాతావరణం తటస్థించటం అదే ప్రథమం శివరాంకు. తప్పకుండా ఆమె ఆహ్వానం అంగీకరించాలనుకున్నాడు లోలోపల

ఇల్లు చేరగానే రాణి నమస్కరించింది.

"మా అమ్మ నా కోసం ఎదురుచూస్తుంటుందండి!" అంటూ భయంగా గబగబా అడుగులు వేసుకుంటూ మెట్లు ఎక్కి ఇంట్లోకి జొరబడిపోయింది రాణి.

తలుపుల వెనకాల అదృశ్యమయిన రాణివైపు చూస్తూ శివరాం ఒక్క క్షణం ఆగి వెనక్కి మళ్ళి పోయాడు.

'భరణం' నాటక ప్రదర్శన ఒక స్కూలు హాస్టల్ హాలులో ఏర్పాటయింది. రాణి నటనగురించి, అందంగురించి పటుత్వమైన శైలిలో పొగడుతూ పరమహంసగురించి ఒక చిన్న జీవితసంగ్రహం ప్రకటిస్తూ, ఫొటోలతో విద్యార్థి సమూహాలమధ్య వెద జల్లబడిన కరపత్రాలు బాగా ప్రచారం తీసుకువచ్చాయి. నాటక ప్రదర్శనద్వారా వినోదం అనుభవించడమే కాకుండా ఒక అందమైన అమ్మాయిని చూడగలమనే భ్రాంతితో విద్యార్థులు తండోపతండాలుగా వచ్చారు. ఆ హాస్టల్ ను నడిపించే పెద్దలు, దానికి అంటిపెట్టుకున్న స్కూలులోని ఉపాధ్యాయులు, ఆ స్కూలును నడిపించే పురప్రముఖులు, వారి స్నేహితులు పరమహంస యివ్వబోయే క్రొత్త నాటకాన్ని చూడాలని ఉబలాటపడుతూ వచ్చారు.

నాటకం తెర వెనకాల గ్రీన్ రూమ్‌లో పరమహంస తన నటనకు అనువైన రూపం దిద్దుకుంటున్నాడు. గ్రీన్‌రూమ్‌లోకి ఉన్న పరిచయం పురస్కరించుకుని, సహాయం నెపంతో శ్రీనివాసు, జగదీశ్వర్, భూమారావు, హుస్సేన్ అలీ చొరబడి అనవసర సలహాలు యిస్తూ, రంగస్థల భాగాన్ని పర్యవేక్షిస్తూ, యింకా రాణి రాలేదేమని మనస్సులో అనుకుంటూ, పరమహంస కోటా ముఖం భంగిమలు పొగడుతూ ఇటూ, అటూ తిరగజొచ్చారు. 'ఆచారి' శివరాంకు కోటా వెయ్యసాగాడు. హాలులో జనం కిక్కిరిసిపోయి కూర్చున్నారు. రంగస్థలం వెనక గ్రీన్‌రూమ్‌లోకి మరో మార్గం లేక హాలుమధ్యనుంచి తలవంచుకుని గబగబ నడిచింది రాణి. ఆమెను ఎవరూ ఆపకుండా, రక్షణ యిస్తూ ఆ హాస్టలును నడిపే నిర్వాహకులలో ఒక యువకుడు, తిన్నగా రంగస్థలం వెనకాలకు తీసుకెళ్ళి విడిచి, బయటకు వచ్చి, చిదానందంగా చొక్కా కాలరు ఎత్తుకుని, ఒక క్షణం హాలులోని జనాన్ని చూసి ముందుకు పోయాడు. హాలులోని జనంలో రాణిగురించి చూడబోయే నటీమణి అంటూ గుసగుసలు వ్యాపించాయి.

రాణి గ్రీన్ రూమ్‌లోకి రాగానే పరిచయస్థులైన నటులందరూ ఎదురుగా ఒక్కసారి కనిపించగానే దిగ్భ్రమచెంది అందరినీ సంతృప్తిపరచాలనే దృష్టితో ప్రత్యేకంగా ఒక్కొక్కరికి నమస్కరించింది...... నమస్కారాలందుకుని నటులంతా మురిసిపోయేరు. ఆచారి తన తీవ్రధోరణిలో నమస్కారానికి చలించక శివరాం ముఖం కోటాతో గట్టిగా బాదుతున్నాడు. నటకులందరితోనూ సమానస్థాయిలో నవ్వుతూ మాట్లాడిన రాణి బహుశా అందరి విషయంలోనూ యిదే ప్రవర్తన చూపుతుందని, తన మీద ప్రత్యేక చనువు ఏమీ మునుపు చూపలేదనే అసంతృప్తి కలిగి మౌనంగా ఊరుకున్నాడు శివరాం. రాణి తనంతటతానే ముఖానికి రంగు వేసుకోసాగింది. మధ్యమధ్య నటకులను పిలిచి ముఖంయొక్క రంగు అద్దకం సరిగా ఉందా లేదా అని ప్రశ్నించేది. జగదీశ్వర్ ధైర్యంగా వేళ్ళ ఆమె బుగ్గపైవేసి, కోటా సరిచేశాడు. శ్రీనివాసు రాణి పెదాలకు సన్నగా ఎర్రరంగు పూశాడు. కనుబొమ్మలు దిద్దాడు హుస్సేన్‌అలీ సరిగా బాణాకృతిలా ఉన్నాయంటూ ఒక చిన్న గేయం చదివి. భూమారావు రాణి హస్తాలకు కొద్దిగా రంగు పూశాడు.

శివరాం తన వేషం పూర్తి చేసుకుని సంభాషణలు వల్లించుకుంటూ తన ధోరణిలో ఉన్నాడు. అతని ముఖభావం జాగ్రత్తగా గుర్తించింది రాణి.

తన చిన్న ట్రంకులోంచి చమ్కీపూల ఎర్రగులాబీ రంగు చీర బయటికి తీసింది రాణి. అది తనకు బాగుందా అని అడగటానికి శివరాంవైపు వెళ్ళబోయింది. భూమారావు ఆమెకు ఎదురువచ్చి 'యీ చీరలో నువ్వు అప్సరసలా వుంటావు, రాణీ!" అంటూ బుగ్గలు బూరించి కులుకుతూ నవ్వాడు. అతని ప్రవర్తనకు కలిగిన చికాకు లోలోపలే అణుచుకుని మౌనంగా ఊరుకుంది రాణి. ఒక కుర్రవాడు మల్లెపూలు తీసుకువచ్చి యిచ్చాడు రాణికి.

'అద్దం ఒకసారి యివ్వండీ!' ముద్దుగా అడిగింది రాణి పరమహంసను.

'కాస్సేపు ఉండవే!' హాస్యం చేశాడు పరమహంస.

'అప్పుడే భార్యాభర్తల్లా ప్రవర్తిస్తున్నారే!' భూమారావు నవ్వేడు.

'కోటా వేసుకోగానే పాత్రల రూపాలు వచ్చేస్తాయి. అప్పటినుంచీ...' నవ్వాడు పరమహంస రాణివైపు చూస్తూ.

రాణి కోపం నటించింది. గబగబ శివరాం దగ్గరకు నడిచి వెళ్ళింది.

'ఏమండీ! యీ పూలు నా తలలో పెట్టండి ...ఆయన అద్దం యివ్వటంలేదు!' శివరాం వైపు చూచి మెల్లగా నవ్వింది రాణి. ఆమె నవ్వులోని కాంతి, చూపులోని కాంతి, శివరాం కళ్ళకు మిరుమిట్లు గొలిపాయి. రాణి ప్రవర్తనలో తనవైపు ప్రత్యేకత చూపిస్తున్నట్లు స్ఫురించింది శివరాంకు. ఆనందంగా నవ్వుతూ మౌనంగా పూలగుత్తి రాణి కొప్పుకు చుట్టాడు శివరాం.

'ఏమండీ! నా వేషం బాగుందా?' వయ్యారంగా గుండ్రంగా, క్రీగంటితో చూసి కులికింది రాణి.

శివరాంవైపు రాణి మొగ్గు చూపిస్తున్నందుకు నటకులంతా కొంత కోపగించుకున్నారు. అయినా చేసేది ఏమీ లేక అసూయ లోపలే అణుచుకున్నారు.

'నాటకంలో ఇంటిపద్దులు చూడాలి కదండీ...మీ దగ్గర చిల్లరడబ్బులు ఏమున్నా వున్నాయా... వేళ్ళతో చిటికలు వేస్తూ హఠాత్తుగా మళ్ళీ శివరాంవైపు వచ్చింది రాణి

శివరాం తాను విప్పిన పంట్లాం జేబు తడిమాడు ఆరణాల చిల్లర కనిపించింది...

అదే జేబులో విడిగా ఉంచిన పదిరూపాయల కాగితం కనిపించలేదు. అందులోనే వున్న జేబురుమాలు తీసి అంతా వెతికాడు మూలల్లో. పర్సులో పెట్టుకున్నానేమో అని అది వెతికినా పదిరూపాయల నోటు కనిపించలేదు; కాని మరో అయిదు రూపాయల కాగితాలు మాత్రం అందులో కనిపించాయి.

'నా జేబులో పదిరూపాయల నోటు పోయిందే!"

చిల్లర రాణికి అందిస్తూ విచారంగా దిగులుగా ముఖం పెట్టాడు శివరాం.

'ఏమయిపోయిందండీ!' ఆశ్చర్యంగా పెద్దగా కేక వేసింది రాణి.

ఆ కేకకు నటకులంతా మూగేరు.

శివరాం పదిరూపాయిలనోటు ఏ విధంగా పోగొట్టుకున్నది, వివరాలన్నీ అడిగి అపరాధ పరిశోధకుడి పాత్ర అభినయించాడు ప్రతి నటకుడూ.

దారిలో రిక్షాలో పడిపోయి ఉండవచ్చునన్నాడు జగదీశ్వర్.

జేబురుమాలు పైకిలాగినపుడు వీధిలో ఎక్కడో జేబులోంచి బైటికివచ్చి గాలిలో ఎగిరి పోయి ఉండవచ్చు నోటు అన్నాడు శ్రీనివాసు.

(ఇంకా వుంది)

# పరిసరాలు - పరికరాలు





మీరు వ్యవసాయదారుడె కావచ్చు. లేదా వడ్రంగి లేదా చిన్న వ్యాపారి కావచ్చు. మీ వృత్తికి తగిన పరికరాలు మీకు కావాలి. అవి పాడైపోయినప్పుడు వాటికి బదులుగా క్రొత్తపరికరాలు కావలసివచ్చును. అందుకు మీరు ఖర్చుపెట్టవలసి వుంటుంది.

అయితే మీరు ముసలివారై పని చేయలేని స్థితిలో వున్నప్పుడుగాని లేదా మీ కుటుంబం మిమ్మల్ని కోల్పోయినప్పుడు గాని కుటుంబ పోషణకు తగిన ఆదాయం వచ్చుటకు ఏమి ఆలోచించారు?

వృద్ధాప్యంలో సుఖజీవనమునకు గాని కుటుంబ సంరక్షణకు గాని ఆదాయమును సమకూర్చుటకు జీవిత భీమాయే ఏకైక మార్గం.

మి అవుసరములకు తగిన భీమా పథకముల వివరములకొరకు నేడే జీవిత భీమా ఏజెంటు నడగండి.





## జీవిత భీమా

— మీరు భీమా చేసిననాడే మీకు రక్షణకలుగుతుంది

EP-LIC-SZ 6



ఆ రోజు మధ్యాహ్నం అందరం హాలులో కూర్చుని మాట్లాడుకుంటున్నాము. శని వారం అవటంచేత అక్కయ్యకి స్కూలు లేదు. వర్కింగ్ అవర్స్ లేవని నేను కాలేజీ నుంచి వచ్చేశాను. అప్పుడే భోజనాలు ముగించాము.

పోస్టుమేన్ తెచ్చియిచ్చాడు ఉత్తరం. నాన్న కవరు విప్పి చదువుతున్నారు. పలుచగా ఒంటి కాగితంమీద నాలుగే పంక్తులు కనిపిస్తున్నాయి. చదువుతుంటే నాన్న ముఖంలో ముందర కలవరపాటు ఆవెంటనే గాంభీర్యం కనిపించాయి.

"ఎక్కడినుంచి నాన్నా ఉత్తరం?" అని ప్రశ్నించాను.

"రాత్రి మెయిల్‌లో బావ వస్తున్నాడుట" అన్నారు నాన్న.

"ఏ బావ?" అని అడిగాను. ఇద్దరుబావలు ఉండటంవలన ఆ ప్రశ్న వేయవచ్చు. కాని పెద్దబావకి మాకు విదేశాలనుంచి రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు కనుక ఆ ప్రశ్న వేయనవసరం లేదు. చిన్నబావ అనుకోవచ్చు. కాని నాన్న ముఖంలో సంచలనం చూస్తే అప్రయత్నంగా ఆ ప్రశ్న వచ్చింది.

"రఘుపతి" అని చెప్తుంటే నాన్న గొంతుకలో బాధ ధ్వనించింది. అక్కయ్య ముఖం తెలతెల్లపోయింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"అదేమిటమ్మా లలితా! ధైర్యంగా ఉండాలి. మనకి మంచి కలుగుతుందనే ఎదురు చూడాలి" అన్నారు నాన్న.

అక్కయ్య లోపలికివెళ్ళి గదిలో తలుపు వేసుకుని పడుకుంది. అమ్మ, నాన్న మాట్లాడుకోవలసిన విషయాలు ఉంటాయేమోనని తోటలోకి వెళ్ళాను నేను.

తోటఅంటే రాజకుమార్తెలు విహరి ప్రమదావనం కాదు. మా నాన్న పే అక్కాచెల్లెళ్ళం నలుగురం, మా ళ్ళిద్దరూ_అందరం కలిసి ప్రేమగా పెం కున్న ఇంటిచుట్టూ ఉన్న చిన్న తోట.

నాన్న ఒక జమీందారని కాని, మేము రాజకుమార్తెలమని కానీ చెప్పను కాని, మేము ముద్దుగా పెరిగాము. ఐదేళ్ళ తరవాత బావ ఎందుకువస్తున్నాడో! ఎండగా ఉండటంచేత వెళ్ళి జామచెట్టు నీడలో నుంచున్నాను.

ఆ సంక్రాంతికి లలితక్కయ్య వస్తుందని నేను సత్యా ఎంతో సంతోషపడుతున్నాము. చిన్నక్కయ్య సత్యా అదే మొదటిసారి అత్తవారింటికి వెళ్ళిరావటం. పండగకి ముందరే వచ్చింది. పండగనాటికి బావలిద్దరూ వస్తారు. తమ్ముళ్ళతో కలిసి బావల నెట్లాగ ఎగతాళి చేయటమా అని ఆలోచిస్తున్నాను. నాన్న వెళ్ళి లలితక్కయ్యని తీసుకువచ్చారు. బండిదగ్గిరికి పరిగెత్తాము. అక్కయ్యనిచూసి అమ్మకళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే "చిక్కిపోయావే" అంది లలితక్కయ్య "ఊ" అని ఊరుకుంది.

ఎవరితోనూ ఎక్కువ మాట్లాడదు. అడిగినదానికి ముభావంగా సమాధానం చెప్తుంది. పరధ్యానంగా ఉండి నిట్టూర్పులు విడుస్తూంటుంది. పలుకరిద్దామన్నా ఎవరినీ గుర్తించినట్లే ఉండదు. అమ్మ నాన్నతో అంది, "లలిత ఏమిటో అదోలాగ తయారయింది. దానికి మనసులో ఏదో బెంగ ఉంది" అని.

పండగ రేపనగా చిన్నబావ వస్తాడని చూస్తున్నాము.

"రఘుపతి ఎప్పుడు వస్తానన్నాడే. ఉత్తరం ఏమైనా వచ్చిందా నువ్వు వచ్చాక?" అని లలితక్కయ్య నడిగింది అమ్మ. ఈసారి లలితక్కయ్య మౌనం వదిలి,

"ఆయన పండగకి రారమ్మా. నేను మళ్ళీ అక్కడికి రానని చెప్పివచ్చేశాను" అంది. అమ్మ నిర్ఘాంతపోయింది. చిన్నక్కయ్య లలితక్కయ్య ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

లలితక్కయ్య వెంటనే తలదించుకుని "అంటే రానని కాదు. ఎంత సర్దుకుపోదామనుకున్నా సానుభూతిలేని ప్రవర్తనను,



# అల్లుడి మంచితనం

అర్థం చేసుకోలేని స్వభావం. నామనసును సరిపెట్టుకోలేక పోయానమ్మా. చెప్పి చూశాను. లాభం లేకపోయింది. మాగ్తే కాని ఉండలేనని మా అమ్మావాళ్ళ దగ్గర ఉంటాననీ చెప్పి వచ్చేశాను," అంది. అమ్మ మాట్లాడలేదు. నాన్న ఏమీ అనలేదు. సత్య మాత్రం అంది!

"నువ్వు తొందరపడ్డావు" అని.

"ఎట్లా చెప్పగలవు?"

"పెళ్ళిఅయి అత్తవారింటికి వెళ్లేదిమనం. అక్కడ పరిస్థితులకు అలవాటు పడవలసింది మనం కాని వాళ్ళు కాదు. ఆడపిల్లలకు అది కష్టంగానే ఉంటుంది కాని అది సహించగలిగి ఉండాలి."

"నీకు తెలియదు సత్యా. సహిస్తాను. ఆ ఓపిక నాకూ ఉంది. కాని ఫలితం ఏమిటి? ఆ స్వభావం మారుతుందనే ఆశలేదు. జీవితమంతా వృథా అయిపోవటంలేదూ. నేను నా జీవితంలో ఏదీ పోగొట్టుకోదలుచుకోలేదు. దాపరికమెందుకు! అక్కడ జరిగిన కథలన్నీ చెప్తా లేరాత్రి" అంది లలిత.

రాత్రికోసం అందరం ఎదురుచూస్తున్నాము. అప్పుడు నాకు పధ్నాలుగుఏళ్లు ఉంటాయేమో. కాని అక్కయ్య విషయంలో ఏదో కుతూహలం లలిత సన్నగా, పొడుగ్గా, నాజూకుగా ఉండి, ఎంతో అందంగా ఉండేది. తలలో జాజులు పెట్టుకుని కాటుక కళ్లతో అక్కయ్య నవ్వుతుంటె అక్కయ్యలాగ ఎప్పుడు ఎదుగుతానా అని తహతహగా ఉండేది. జామచెట్టుకింద కూర్చుని ఎన్నో కథలు చెప్పేది అక్కయ్య. బావతో ఎందుకు పోట్లాడి వచ్చింది లలిత? నామనసులో ఎంతో ఆశ్చర్యంగా ఉండేది. అక్కయ్య కలలుకన్న రాజకుమారుడు కాదూ బావ!

వరండాలో చాపవేసుకుని తలకింద దిండు పెట్టుకుని పడుకుంది అమ్మ. నాన్న పడకకుర్చీలో మేనువాల్చారు. తమ్ముళ్లు చెల్లి పడుకున్నారు. లలితక్కయ్య అమ్మ దగ్గర కూర్చుంది మోకాళ్ళమీద తల ఆనించుకుని. సత్య అమ్మతలవైపు కూర్చుని ముంగురులు సర్దుతోంది. అమ్మ పక్కన పడుకుని నేను వింటున్నాను.

"ఆయన నాయెడల కఠినంగా ఉన్నారని కాదు." అది ఒకరకమైన స్వభావం. అందరి స్వభావాలు ఒకలాగ ఉండవు. కలిసి ఉండవలసిన అవసరం వచ్చినప్పుడు కొంతవరకూ సహించక తప్పదని మనసును సమాధానపరచాలనుకు నేదాన్ని. కాని ఆయనకు ఈ ఉద్దేశం లేకపోవటంవలన అది నాకు సాధ్యం కాలేదు.

మనం తినటానికి ఒకవస్తువు కొనుక్కుంటాము. తినేటప్పుడు దానిరుచి మనసులో పెట్టుకుంటే ఆనందం. కాని దానివెల రూపాయి. రూపాయి ఖరీదుగల వస్తువుని మనం తింటున్నాం అనుకుని తింటుంటే దానిలో ఉండే ఆనందం సహజమైంది కాదు.

మనంమాత్రం జమీందారుల మేమిటమ్మా? కాని మాపెంపకం వేరు. పొరపాటున కొబ్బరినూనె ఒలికితే "అయ్యో ఒలికిందా తల్లీ, క్రిందపడింది తలకి రాసుకోవే," అంటావు నువ్వు. ఆయన ప్రతీది రూపాయణాలలో లెక్కకడతారు. నూనె తెచ్చారు. నాకు వాడటం చేతకాదేమో, ఇరవై రోజులు వచ్చింది. నెలలోపల మళ్ళీ తీసుకురారుట. తరవాతి నెల, తగ్గించి రాసుకోవటం మొదలు పెటాను. ఒకరోజు "ఏమిటాజుట్టూ నువ్వూను. తలగువ్వుకోవటం చేతకాదా?" అన్నారు. కొబ్బరినూనె చేతిలో వేసుకుంటుంటె ఒలికింది. అది రెండు రోజులకి వచ్చేదికదా అనిపించింది. ఉండీ కూడా ఈ పేదరికమేమిటి? నాకుకూడా ఈరకపు దృష్టి అలవడిందే అని కళ్ళలో నీరు తిరుగుతుంటె గానే నవ్వువచ్చింది. ఎంతతిన్నా, ఎంత అనుభవించినా ఏదో పేదరికంలో ఉన్నట్లుంటుంది కాని మనసుకు తృప్తిగా ఉండదమ్మా."

"అదికాదే లలితా ఇంతఖర్చు అవుతుంది: ఇది కావాలని చెప్పాలి," అంది అమ్మ.

"చెప్పినా లాభంలేదమ్మా. తగ్గించాలంటారు."

"అంత సంపాదిస్తాడు. ఏంచేస్తాడే? నీకు ఖర్చుకి ఇవ్వడా?"

"నాకే స్వతంత్రం లేదుకాని, ఏలోటు వచ్చినా తప్పనాది. నేనారకంగా సంసారం చెయ్యలేనమ్మా. వారిదృష్టిలో నేను ఒకచేతకానిదాన్ని." అక్కయ్య చెంపలు కన్నీళ్లతో తడిసి మెరుస్తున్నాయి. ఎన్నాళ్లనుంచి గడ్డకట్టిన దుఃఖమో అది.

"పిచ్చిదానా! కొబ్బరినూనె రాసుకోవటం మానుకుంటారుటే."

"మరి వాళ్ళడబ్బంతా నేను తింటున్నానని బాధపడుతుంటే."

ఈసారి అమ్మ మాట్లాడలేదు. సత్య మెల్లగా అంది.

"అభిమానానికిపోతే అట్లాగే కనిపిస్తుంది. నీకు అనుభవంలేక దుబారా చేస్తావని కొంచెం జాగ్రత్తగా ఉంటాడేమో. భార్యవయ్యాక నీవు పరాయిదానివా. తినక తప్పుతుందా?"

"అది వాళ్ళకి తోచాలికదా" అని "ఛీ" అనుకుంది లలితక్కయ్య.

"ఏమోనమ్మా. పిల్లవాడు బాగున్నాడు. ఇంత ఆస్తికూడా ఉందని ఆగకడి పిల్లనిచ్చాము" అని భారంగా అంది అమ్మ.

కొంతసేపు మౌనంగా గడిచాక.

"నేను పుస్తకాలు చదువుకోకూడదు. నవలలు చదివితే పాడైపోతారట. ఎదురు తిరుగుతారట. అదో ఇదో ఏదో పుస్తకం చదువుకుంటున్నాను, ఏమిటో దక. ఇంటికి వచ్చారు. నేను చూడలేదు. దప్పున చేతిలో పుస్తకం లాగారు. లాగటంలో అది చిరిగింది. నాకు కోపంవచ్చింది. అది పద్మ పెళ్ళికి కానుకగా ఇచ్చిన పుస్తకం."

"ఇంకొక పుస్తకం ఇవ్వండి," అన్నాను.

"పుస్తకాలు చదవవద్దనలేదా! చింపి పారేస్తాను" అన్నారు.

"ఇది చౌకరకం పుస్తకం కాదు. కావ్యం

# ★ అల్లుడి మంచితనం ★

అనిపించుకోతగిన తెలుగువనిత. నా స్నేహితురాలు ఇచ్చిన పెళ్ళి కానుక. మందర ఇవ్వండి" అన్నాను గంభీరంగా. ఆయన ఇచ్చివెళ్ళిఉంటే నేను పశ్చాత్తాపపడి ఉండేదాన్ని. కాని ఆయన,

"నీకు నీ స్నేహితురాలు ఎక్కువా? నేనా?" అని ప్రశ్నవేశారు. అసహ్యం వేసింది.

"మీకు మీ విలువ తెలీదు. ఆ పుస్తకం విలువ తెలీదు. స్నేహం తెలీదు" అన్నాను. కోపం వచ్చింది. ఆ రోజంతా నాతో మాట్లాడలేదు. కోపం పోగొట్టాలని,

"మరి తీరిక సమయాలలో ఏం చెయ్యమంటారు?" అనడిగాను.

"ఆవును కొంటారుట. పాడిచెయ్యాలిట. ఇంకా తీరికఉంటే కుట్టుమిషను కొంటారుట. ఏ పని చేసినా ఉపయోగకరంగా ఉండాలిట. అంతేకాని మనోవికాసానికి విలువలేదు వారిదృష్టిలో. ఆ మాటలంటుంటే మనసు విరిగిపోతుంది. నాన్న నన్ను ఎందుకు చదివించారా! నాకు ఆ ఆశలన్నీ ఎందుకా అని ఒకటే బాధగా ఉంటుందమ్మా. జీవితాన్ని గురించి ఆశయాలు లేవు ఆయనకి. వెన్నెలను చూస్తే నేను పాట పాడుకోవలసిందే. జీవితాన్ని తీయని కావ్యంలాగ గానంచేస్తూ గడపాలని ఆశాసౌధాలు నిర్మించుకున్నా ఇప్పుడయినా నా ఆశయాలకు విరుద్ధంగా జీవించి నాలో ఉత్సాహాన్ని అణచివేసుకోవటం నా కిష్టం లేదమ్మా. వచ్చే మార్చికి ఇంటర్ పరీక్షకి అప్పియర్ అవుతాను. చదువుకుంటాను," అంది లలిత.

అమ్మ, నాన్న మాట్లాడలేదు.

"జీవితంతో చెలగాటమాడితే ఎట్లాగ అక్కా? నువ్వు పట్టింపులకు పోవలసినంత కారణం ఏమీలేదు. మెల్లగా అలవాటు పడాలి అతని స్వభావానికి. నువ్వు మనసు విప్పి చెప్తే అతనుమాత్రం నీమాట కాదనగలడా? నీ సంగతి ఆలోచించుకుని నువ్వు అమ్మ, నాన్నదగ్గర ఉంటానన్నావు కాని, ఇంకా ఇద్దరు చెల్లెళ్ళకు పెళ్ళికావాలి. వాళ్ళపిల్లలు సంసారంచెయ్యకపోతే చెడ్డపేరు మనకి వస్తుందని ఆలోచించావా!" అంది సత్య– లలితక్కయ్యకి కోపంవచ్చింది.

"వాళ్ళు ఇటువంటి పెళ్ళిళ్ళు అసలు చేసుకోనే చేసుకోరు. నేను తెలియక ఒప్పుకున్నా అప్పుడు. కాని ఒకళ్ళకోసం నేను సర్వనాశనం కావటానికి నేను వచ్చినా ఒప్పుకోను" అని లేచి గదిలోకి వెళ్ళిపోయింది. నాన్న వెనకనే వెళ్ళారు. ఏడుస్తూ పడుకున్న లలిత తల నిమురుతూ,

"ఏంచేసినా మీరు సుఖపడాలనే చేస్తాం తల్లీ! నీకు చదువుకోవాలనిఉంటే ఇక్కడే ఉండి చదువుకోమ్మా. నేను వద్దంటానా?" అన్నారు.

"ఇదంతా నేను ఈ రెండేళ్ళనుంచీ అనుభవిస్తున్న బాధ నాన్నా" అంది దిండులో తలదూర్చి ఏడుస్తూ లలితక్కయ్య!

"మనసులు కలవలేదుతల్లీ! అంతమాత్రానికే బంధాలు తెంపుకోలేమమ్మా." చటుక్కున అక్కయ్యలేచి కూర్చుంది.

"అదినాకు తెలుసు నాన్నా! నేను చాలా సాహసం చేసి వచ్చాననికూడా తెలుసు. కాని ఇదివారిలో ఏమైనా మార్పు తెస్తుందేమోనని నా ఆశ. అదే చెప్పి వచ్చాను నేను" అంది.

ఆ తరవాత అక్కయ్య ఏడుస్తూనే ఉంది. నాన్న మాట్లాడకుండా తలనిమురుతూ ఉండిపోయారు. ఇప్పుడు తలుచుకుంటే నా కంఠం గద్గదికమౌతోంది.

* * *

చిన్నక్కయ్య సత్య చాలా గంభీరమైన మనిషిలా కనిపిస్తుంది నాకు. లోపల ఏ కోరికలు ఉంటాయో, ఏ ఊహాలు మెదులుతుంటాయో తెలియదు. ఏ పరిస్థితులలో నైనా గంభీరమైన చిరునవ్వుతో ఉంటుంది. సత్యని చూస్తే మెచ్చుకో బుద్ధివేస్తుందికాని, నేను మాత్రం అట్లాగ ఉండలేను. ప్రతివిషయం నన్ను నిలువునా కదిలించివేస్తుంది. నాలో భావోద్రేకం కల్లోలం రేపుతూ ఉంటుంది. పండగలు అయ్యాక అందరితో సరదాగా ఇంకొక రెండు రోజులు గడపాలని ఉన్నప్పటికీ బావరమ్మన్నాడని వెళ్ళిపోయింది సత్య. తన మనసులోమాట చెప్పదు. బావకి ఎదురుపలుకదు బావచేసే అధికారం చూస్తే కోపంవస్తుంది. ఇవన్నీ ఎందుకు సహిస్తుంది సత్య? అడిగితే "అది నా స్వభావమే. నేనేమీ ఆలోచించను" అంటుంది. నిజమే. ఈ నాలుగేళ్ళలో చిన్నబావ చాలామారాడు. మొదట బావ ఇంటి యజమాని. పెత్తనమంతా అతనిదే. అతను కొని తెచ్చిన చీర రిమార్కు లేకుండా కట్టుకునేది సత్య. ఇప్పుడు సత్య ఆ ఇంటికి రాణి. ఫలానా చీర బాగుంది అంటుంది. "కొనుక్కో" అంటాడు బావ.

"నీ కెందుకు ఆ విషయాలు" అని కసురుకునే బావ, ఇప్పుడు ప్రతివిషయం గురించి సత్యతో సంప్రదిస్తాడు సత్యకి చెప్పనిదే ఏ పని చెయ్యడు. "అంతకంటే ఏమి కావాలి ఆడవాళ్ళకి" అంటుంది సత్య.

(49-వ పేజీ చూడండి)

# రాశిఫలాలు

★ దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి ★

**14-10-1959 మొదలు**
**20-10-1959 వరకు**

మేషం:

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం మీకు అన్నివిధాలా ప్రోత్సాహకరంగా ఉంటుంది. క్రొత్త మనుష్యుల స్నేహం సహాయం లభిస్తవి. బంధుమిత్రులతో ఇంతకు ముందున్నటువంటి పేచీలు క్రమక్రమంగా తగ్గిపోయి మనశ్శాంతి లభిస్తుంది. ఆదాయం బాగా పెరుగుతుంది. కాని ఈ సమయంలో కుటుంబంలో ఖర్చులు కూడా పెరుగుతవి. వృత్తివ్యాపారాలలో మీ యోచనలు కార్యరూపంలోనికి వచ్చి గౌరవంతో పాటు ధనాదాయం కూడా లభిస్తుంది. శుభ పుణ్యకార్యాలలో పాల్గొంటారు. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం సకాలంలో రాక మనస్సుకు కొంత అశాంతి కలుగుతుంది. కాని, అందువల్ల మీ పనులకు ఆటంకం కలుగదు. నూతన కార్యక్రమాలనుగురించి ఇతరులు మిమ్ములను ప్రోత్సాహపరచవచ్చు నిదానించటం మంచిది. 15,16 తేదులలో త్రిప్పట, అధిక ఖర్చులు, శుభ వార్తలు.

* * *

వృషభం:

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రతిపనీ శీఘ్రంగా జరుగబోతున్నట్లు కనుపిస్తుంది. కాని, నిదానం తప్పదు. ప్రయాణాలు చేయవలసివస్తుంది. వృత్తిలో అభివృద్ధికరమైన మార్పులు వస్తవి. ముందుముందు జరుగబోవు కార్యక్రమాలను గురించి ఈ సమయంలో ప్రయత్నాలు ఆరంభమౌతవి. విలువగల వస్తువులు కొంటారు. ప్రస్తుతం మీ ఆరోగ్యం సరిగాయుండనందువల్ల ముఖ్యమైన పనులలో అశ్రద్ధ, ఆలస్యం కనుపిస్తుంది. ఈ సమయంలో ఇతరుల సలహాలను నమ్ముకుని భారమయిన కార్యక్రమాలు పైన పెట్టుకొనటం మంచిది కాదు. సంఘంలో గౌరవం పెరుగుతుంది. ఆడంబరములకై అధికంగా ధనవ్యయం చేయవలసి వస్తుంది. ఈ వారంలో బంధుమిత్రులకు సంబంధించిన పనులు విశేషంగా మీకు శ్రమను కలిగిస్తవి. ఈ వారం రెండవ భాగంలో ఉత్సాహకరమయిన మార్పులు వస్తవి. వృత్తి వ్యాపారాలలో అభివృద్ధి, ధన లాభం, బంధువులవద్దనుంచి శుభవార్తలు.

* * *

మిధునం.

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఈ వారం మనస్సుకు తీరిక యుండదు. ప్రతిపనీ ముందు యోచనతో జాగ్రత్తగా నిర్వహించి గౌరవం పొందగలుగుతారు. ఏపని తలపెట్టినా సంతృప్తికరంగా జరిగి సంపూర్ణమైన ఫలితాన్నిస్తుంది. కాని ఆరంభంలో సందేహాలు వస్తూవుంటవి. స్థిరాస్తులకు సంబంధించిన పనులు నిదానంగా అనుకూలిస్తవి. వృత్తి ఉద్యోగాలలో గౌరవం, పైవారియొక్క ఆదరాభిమానాలు లభిస్తవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా యుండకపోవటంవలన మనస్సుకు కొంచెం చికాకు కలుగుతుంది. ఇతరుల వద్దనుంచి ఎదురు చూస్తున్న ధనసహాయం సమయంలో లభించి కార్యసాఫల్యం అవుతుంది. వారాంతంలో ప్రయాణాలు చేస్తారు. అకస్మాత్తుగా ఖర్చులు పెరుగుతవి. ఉన్నత స్థితియందున్నటువంటి వారి పరిచయం లభిస్తుంది. అందువల్ల ముందు ముందు అనుకూలత యుంటుంది. 19 20 లలో చోరభయం, కార్యవిఘ్నం. పెద్దమనుష్యులతో సంప్రదింపులు.

**గ్రహస్థితి**

సింహంలో శుక్రుడు, కన్యలో రాహువు, కన్యతులల్లో సూర్యుడు, తులలో కుజబుధులు, వృశ్చికంలో గురువు, ధనుస్సులో శని, మీనంలో కేతువు, కుంభ మీన మేష వృషభాలలో చంద్రుడు.

* * *

కర్కాటకం.

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

అన్నివిధాలా అనుకూలమైన సమయం, వ్యవహారరంగంలో మీ ప్రయత్నాలు చాలా వరకూ కార్యరూపంలోకి వస్తవి. బంధుమిత్రులకు అనేక సందర్భాలలో సహాయం చేయవలసి వస్తుంది ఖర్చులు బాగా పెరుగు చెప్పినమాటను సకాలంలో [illegible] గలుగుతారు. వృత్తిలో వృద్ధికరమైన సూచనలు కనుపిస్తవి. పుణ్యకార్యములు జరుగుతవి. వారం మధ్యలో పిల్లలయొక్క అనారోగ్య కారణంవల్ల మనస్సుకు అశాంతి కలుగుతుంది కాని, దైవానుగ్రహంవల్ల త్వరలో నివర్తిఅవుతుంది. శుభకార్యప్రయత్నాలు అనుకూల వాతావరణంలో జరుగుతూ యుంటవి. ఉత్తర దిక్కునుంచి శుభ వార్తలు తెలుస్తవి. రాజకీయరంగంలో గౌరవం పెరుగుతుంది. 16, 17 తేదీలలో వృత్తిలో ప్రోత్సాహకరమైన సూచనలు, శుభవార్తలు, మిత్రులవల్ల కార్యసిద్ధి.

* * *

సింహం:

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

బాహ్యవిషయాలలో చాలా ఉత్సాహకరంగా యుంటుంది. గౌరవం, పలుకుబడి పెరుగుతవి. కానివాటితో బాటు బాధ్యతలు, ఖర్చులు కూడా విపరీతంగా పెరగటంవల్ల మనస్సులో ఆందోళన, చికాకు కలుగుతవి. మీ బుద్ధిబలంతో సమస్తము నిర్వహించి మీ మాటకు భంగంరాకుండా కాపాడుకో గలుగుతారు. వృధాగా ఖర్చులు పెరిగిపోయి ఇతరుల సహాయం ఎదురుచూడవలసి వస్తుంది. దూరదేశమందున్న బంధుమిత్రులవద్దనుంచి అనుకూలవార్తలు వస్తవి. వృత్తిలో శ్రమకరంగా యున్నా, సాటివారిలో గౌరవం పెరుగుతుంది. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. వారంచివరలో మీ ఆరోగ్యం సరిగా వుండదు. దుర్గాస్తోత్ర పారాయణం చేసుకొనటం మంచిది. ఇంతకుముందు మీకు ప్రతికూలంగా ఉన్న వ్యక్తులే ఈ సమయంలో మీకు సహాయం చేస్తారు. 14 15, 16 లలో కార్యభారం, త్రిప్పట, స్వల్ప ధనలాభం. అధికారులతో పరిచయం.

* * *

కన్య: (ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ప్రస్తుతం మీరు ఎంతజాగ్రత్తగా ఉండామనుకున్నా తప్పనిసరిగా ఇతరుల కార్యభారం పైన వేసుకోవలసి వస్తుంది. ఆదాయం బాగానే ఉంటుంది, కాని, ఖర్చులు విపరీతంగా పెరగటంవల్ల ఇబ్బందిపడవలసివస్తుంది. బుద్ధి చాతుర్యంతో మీ ధర్మాన్ని నిర్వర్తించుకుని మాటను కాపాడుకొంటారు. వృత్తి, ఉద్యోగాలలో మనస్సుకు ఉత్సాహకరంగా వుండదు విశేషమైన ఆలోచనలమూలంగా ఆరోగ్యం చెడే అవకాశాలున్నవి. విష్ణు సహస్రనామ పారాయణం చేసుకొనటం మంచిది. కుటుంబంలో సుఖ సౌఖ్యాలు లభి

# రాశిఫలాలు

స్తవి. విలువగల వస్తువులు కొంటారు. ఈ సమయంలో బంధువులవల్ల కొంత సహాయం లభిస్తుంది. ప్రయాణాలు చేయవలసివస్తుంది. పశ్చిమ దిక్కునుంచి ముందు ముందు మీకు అనుకూలించగల వార్తలు తెలుస్తవి. వారాంతంలో పొరపాటువల్ల వస్తునష్టం. 16, 17, 18 తేదులలో కలహ సూచనలు. నూతన కార్యక్రమాలనుగురించి యోచనలు, వృథా ఖర్చులు.

* * *

**తుల:**

(చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2 3, పా)

ఇతరుల సహాయంతో మీరు మీ వృత్తి వ్యాపారాలలో ముందుకు పోగలుగుతారు. తలపెట్టిన ప్రతిపనీ ఆరంభంలో కొంత శ్రమ, ధనవ్యయము కనుపించినా చివరకు సంతృప్తికరంగా జరుగుతుంది. ఆదాయంకూడా కొంత వరకు పెరిగే అవకాశాలున్నవి. పాటీవారిలో మీమాటకు గౌరవం లభిస్తుంది. తలపెట్టిన ప్రయాణాలు సక్రమంగా జరిగే అవకాశాలు లేవు. సాంఘికంగా మీరు ఇతరులకు చాలా సహాయం చేయగలుగుతారు. అధికారులతో స్నేహము అందువల్ల ముందుముందు అనుకూలత బాగుంటుంది. ఈ వారం ఆరంభంలో మీ ఆరోగ్యం లోపించటంవల్ల పనులలో నిదానం కనుపిస్తుంది. కాని క్రమక్రమంగా రెండవ భాగంలో అన్నివిధాలా బాగుంటుంది. శుభకార్య ప్రయత్నాలు నిదానంగా అనుకూలించే అవకాశాలున్నవి. 18, 19, 20 లలో మానసికంగా ఆందోళన ధనలాభం, గౌరవప్రాప్తి, నిర్ణయం లేని కార్యక్రమాలు.

* * *

**వృశ్చికం:**

(విశాఖ 4-వ పా, అనూరాధ, జ్యేష్ఠ)

ఈవారం చాలా ఉత్తమమైన కాలం. కుటుంబంలో శుభపుణ్యకార్యాలు జరుగుతవి. విలాసవినోదాలలో కాలం సుఖంగా జరుగుతుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు చాలా వరకు కార్యరూపంలోకివచ్చి ఉత్తమమయిన ఫలితాన్ని పొందగలుగుతారు. ఉత్తరదిక్కునుంచి సంతోషకరమైన వార్తలు తెలుస్తవి. క్రొత్తవారి స్నేహం, సహాయంకూడా లభిస్తవి. ఈ సమయంలో ఒకటి రెండు సందర్భాలలో కలహసూచనలు రావచ్చు. అంతమాత్రంచేత మీ ప్రయత్నాలు ఆగిపోవు. విశేషధనవ్యయంతో చేయదగు ముఖ్యమైన కార్యక్రమాలకు అనుకూలమైన కాలము. వారంమధ్యలో భార్యయొక్క, సంతానముయొక్క ఆరోగ్యం కొద్దిగా లోపిస్తుంది. ముఖ్యమయిన కాగితాలుగాని, విలువగల వస్తువులుగాని పోయే అవకాశాలున్నవి. 19, 20 తేదీలలో అదృష్ట సూచన, నూతన మిత్రలాభం, వృత్తిలో అభివృద్ధి. యత్నకార్యసిద్ధి.

* * *

**ధనుస్సు:**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ఈ వారం మీరు చాలా శ్రద్ధవహించి శ్రమపడి మీ కర్తవ్యాన్ని నెరవేర్చుకోగలుగుతారు. కాని ప్రతి చిన్న సందర్భంలోను ఇతరులతో పోటీలు, ధనవ్యయం కనుపిస్తూ యుంటవి. పట్టుదల అవసరం. వృత్తి వ్యాపారాలలో శ్రమ వ్యయప్రయాసలు యుంటవి. కాని గౌరవము, శ్రమకు తగిన ఆదాయము లభిస్తవి అధికారులతో అభిప్రాయభేదాలు రాగల అవకాశాలున్నవి. ఈ సమయంలో క్రొత్త మనుష్యులను నమ్మి భారమైన పనులు ప్రారంభించవద్దు. దూరమందున్నటువంటి బంధుమిత్రులవద్దనుంచి అసంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి. కుటుంబంలో ప్రశాంతంగా యుంటుంది. వారాంతంలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ఇతరులవద్దనుంచి రావలసిన ధన సమయంలో చేతికివస్తుంది. ధర్మపుణ్య కార్యాలలో పాల్గొంటారు. పెద్దవారితో పరిచయభాగ్యం లభిస్తుంది. శ్రమతోకూడిన ప్రయాణసూచనలు, 14, 15 లలో మిత్రకలహం, అధిక ధనవ్యయం.

* * *

**మకరం:**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ట 1, 2 పా)

గతవారంకన్నా ఈ వారం అన్నివిధాలా ప్రోత్సాహకరంగా యుంటుంది. వ్యవహారరంగంలో విజయం సాధిస్తారు. ఇతరుల కార్యకలాపాలు మీరు పైనవేసుకుని నిర్వహించగలుగుతారు. కుటుంబంలో శుభకార్యప్రయత్నాలు చేస్తారు. గాని ఒక నిర్ణయానికి రావు. మనస్సు ఉత్సాహపూరితంగా యుంటుంది. మీవృత్తి ఉద్యోగాది విషయాలలో అభివృద్ధికర సూచనలు కనుపిస్తవి. ఒకరిద్దరు క్రొత్త మనుష్యులు మీకు అన్నివిధాలా సహాయం చేస్తారు. స్థిరాస్తులకోసం ప్రయత్నాలు ప్రస్తుతం అనుకూలించకపోవచ్చు పబ్లికు సంబంధించిన లావాదేవీలలో నిర్మొహమాటంగా యుండటం మంచిది. ముందు ముందు కలహాలు చిక్కులు రాకుండా చూచుకొనండి. తొందరపడి మీ రహస్య విషయాలను ఏ సందర్భంలోను ఇతరులకు తెలియనీయవద్దు. 18 19, 20 తేదులలో శుభవార్తలు ధనలాభం. ఆడంబరం నిమిత్తం ధనవ్యయం. గౌరవలాభం.

* * *

**కుంభం:**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఈవారం కొన్ని ముఖ్య ఘట్టాలలో శ్రమకరంగా తోచినా మీబుద్ధిబలాన్ని ఉపయోగించుకుని, సమయానుకూలంగా మీపనీ ఇతరులపనీ కూడా సాధించుకోగలుగుతారు. ఆరంభంలో కొన్ని ఆటంకాలు యున్నట్లు తోచినా చివరకు సంతృప్తికరమైన ఫలితం లభిస్తుంది ఈసమయంలో ఇతరుల సహాయం నిమిత్తం ఎదురుచూడటం మంచిది కాదు. వృత్తి వ్యాపారాదులలో మీరు తలపెట్టిన పనులు నిరాటంకంగా జరగగలవు. కొన్ని సమయాలలో నీచులతో కలహాలు వచ్చి మనశ్శాంతికి భంగం కలుగగలదు. దేహసౌఖ్యంబాగుంటుంది. ఇతరుల వద్దనుంచి మీరుయెదురుచూస్తున్న వార్తలు నిదానంగా రాగలవు. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా యుండండి. రాజకీయవిషయాలలో మీ మాటకు విలువ పెరుగుతుంది. ఖర్చులు విపరీతంగా పెరుగుతవి 17,18 లలో బాధ్యతతో కూడినపనులు, తరచు సందేహాలు, తలవని తలంపుగా ధనలాభం.

* * *

**మీనం:**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

దైవానుగ్రహంవల్ల మీరు ఈ సమయంలో కొన్ని చిక్కులనుంచి బయటపడగలుగుతారు. ఇంతకుముందు మీరు యత్నించినా జరుగని ముఖ్యమైన పనులు మీ ప్రయత్నం అంతగా అవసరం లేకనే నెరవేరటం ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఆదాయం అంతగా పెరుగుగాని మీరు ఇతరులకు చెప్పినమాటను కాలంలో కాపాడుకోగలుగుతారు. మీ [illegible]రులతో కలసి చేయు పనులు సంతృప్తి[illegible]గా జరుగక మధ్యమధ్య కొంచెం చి[illegible] కలుగుతుంది. గాని నిదానంగా అన్ని [illegible] అనుకూలించగలవు. కుటుంబంలోని వా[illegible]రోగ్యం సంతృప్తికరంగా ఉండదు [illegible]లువగల వస్తువులు కొనటం నిమిత్తం, సుఖసౌఖ్యాల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. బంధుమిత్రులరాక, 17, 18 లలో శుభవార్తలు. ఆకస్మికంగా ధనలాభం, మిత్రులలో కలహసూచనలు.



# డసరా - సరదా

శ్రీనివాస కాశ్యప

అమ్మా! మాకూ బొమ్మ
లను కొనవటమ్మా!
నేను, చెల్లాయీను
కొలువు పెడతామూ!

కొలువు చూస్తే చాలు
కలుగునే సరదాలు!
కొనమనవుటే అమ్మ
నాన్నారితో చెప్పి?

ఇరుగింటి ఇందిరా
పొరుగింటి సుందరీ
చక్క చక్కటి బొమ్మ
లెన్నో కొన్నారూ!

నేతాజి బొమ్మ బహు
నేర్పుతో చేసేడు!
అచ్చుగా మనిషివలె
ముచ్చటేస్తోందమ్మ!

అంత్యమైతేను అసలు
దొరకవె ఇంక—
మంచి బొమ్మలు ఎన్నొ
మనవూరు వచ్చాయి!

అందులో శ్రీకృష్ణు
డతి అందగాడమ్మ!
బోసినవ్వుల గాంధి
బొమ్మ బాగున్నదే!

పొట్టి శ్రీరాములిన్ని,
చిట్టి సోదమ్మనీ,
ఆంధ్రకేసరి బొమ్మ
అంా ముగ పేర్చింది!

బొమ్మలా పండుగకు
బొమ్మలను పెడతాను,
పేరంట మందర్నీ—
పిలిచి వస్తానే!




# బాలవాక్యాలు

సురభి నరసింహము

శ్రీరస్తు! శుభమస్తు! ఆర్యులారా! మీకు
విజ్ఞానభవనాల విద్య నేర్చెడి మేము
సెయ్య మలరగ నేడు అయ్యవారలఁగూడ
విచ్చేసినామయ్య ముచ్చటగ మిముఁజూడ॥

చెలిమి బలిమిని మేము కలసి మెలఁగుదుమయ్య
కలిమి బలిమిని కలిగి విలసిల్లి యెల్లపుడు
దానధర్మములందు ధన్యాత్ములగు మీరు
విద్యాలయమ్ములను వర్ధిల్లఁజేయుఁడీ॥

ప్రేమతో మీరిచ్చు బహుమాన మేదైన
కొంచెమైనను గాని గొప్పగా నెంచెదము
అయ్యవారికి చాలు, అయిగు రూప్యములైన,
పిల్లవారికి చాలు చిల్లరైనను కొంత॥

గొప్పగా మీరిడిన పప్పుబెల్లంబులను
నప్పరించుచు మేము మెప్పుగాఁ దలచేము!
ఈ పర్వములయందు మీ పుణ్యనామముల
కీర్తించెదము మిగుల ఘనతతో నెల్లెడల॥

గేహ గేహమునందు గౌరవమ్ములు, సిరులు,
దీపింప పల్కెదము దివ్యవాక్కుల మేము
"బాలవాక్యములెల్ల బ్రహ్మవాక్యము లనెడి
లోకోక్తి సత్యమ్ము, మీ కీర్తి నిత్యమ్ము"॥

విద్య లెలను నేర్చి వినయశీలమునొంది
విజ్ఞాన కుసుమములు వికసింప హృద్వనిని,
ధర్మమార్గము నెపుడు తప్పకుండగ నడచి
దేశగౌరవశ్రీల భాసిల్లఁజేసెదము॥

నవరాత్రములయందు వివిధపూజల వెలయు
దేవీత్రయం బిడుత దీవెనల దయతోడ!
విజయదశమీ విభుడు శ్రీరామచంద్రుడు మీకు
వీరత్వశౌర్యముల్ వెలయఁజేయును గాత!

రంగు రంగుల వెలయు రమణీయ ధనువులను
పాండవుల రీతిగా పట్టితిమి హస్తాల,
మా విద్యలనుఁ జూచి మమ్మెల్ల మన్నించి
కాదనక మాకిందు గౌరవమ్మున కొన్న॥

ఓ పుణ్యధనులార! ఓ పౌరవరులార!
వేడ్క కలరగ మేము పఠియించి పద్యాల
ఆటపాటల మిమ్ము అలరించినామయ్య
మన్నించి పంపినఁ మరలిపోయెదమయ్య!






## బాలలసంఘం 'ఏ' వర్గం పోటీలో మొదటి బహుమతి పొందినకథ

ఆ రోజు ఆదివారం. స్కూలుకు సెలవు అవటం చేత ఏమీ తోచక స్నేహితులంతా కలిసి నాటకం వేద్దామనుకున్నారు. "ఆలస్యం అమృతం విషం" అన్నారు పెద్దలు. అనుకోవటమే తడవుగా పని పూర్తి చేయటం వారికి బాగా అలవాటు. సరే నాటకం ఎక్కడ వేయాలి అనే ప్రశ్న వచ్చింది. స్నేహితులంతా ఒక్కసారి ఆలోచనలో పడ్డారు.

"మా నాన్నగారికి కూడా ఆఫీసుకు సెలవుగదా! ఇంట్లోనే వుంటారు. ఎలాగ" అన్నాడు గోపీ నిస్సారంగా.

"ఒరేయ్ మా నాన్నగారు అక్కయ్యకు పెళ్లి సంబంధంకోసం తిరిగి తిరిగి ఇవాళే వచ్చారురా. ఇహ ఈ రోజు ఎక్కడికీ కదలరు కూడా", అన్నాడు రాము సందేహంగా.

"మా అన్నయ్యకు "కాలేజీకి సెలవు. ఇంట్లోనే వున్నాడు. ఈ కాలేజీలకు కూడా ఈ రోజే ఇవ్వాలీ సెలవు" అన్నాడు శ్యాము బాధగా.

ఇక మిగిలింది రాజు ఒక్కడే. ఆతనికి అడ్డు చెప్పటానికి యేమీ తోచలేదు. నాన్నగారు పొలం పనులు మూలంగా పొలం వెళ్ళారు. తనకు అన్నయ్యల బాధ అసలే లేదు. అందుచేత తన ఇంటికి మార్చేశాడు ప్రోగ్రాం.

నాటకానికి కావలసిన సామగ్రి అంతా చేకూర్చారు. హాలంతా చక్కగా శుభ్రపరచారు. నాటకం వేసేందుకు తెరకట్టాల్సి వచ్చింది. నేటితో తెరకట్టాలి? అనే ప్రశ్న మళ్ళీ వచ్చింది.

రాజు క్షణకాలం ఆలోచించాడు. ఎదురుగా టేబుల్ పై ఆ రోజే తెచ్చిన ఇస్త్రీ బట్టలు 'మేమున్నాము' అన్నట్లు పిలుస్తున్నాయి. రాజు ఒక్క పరుగున వెళ్ళి రెండు ఇస్త్రీ పంచెలు తెచ్చి తెరకట్టాడు.

(44-వ పేజీ చూడండి)

బొజ్జి తండ్రితో కలసి బయలుదేరింది. మలుపు తిరిగాగా. ఆఁ అదిగో అక్కడే ఆ షాపు లోనే నిన్న తను పాపాయి బొమ్మ చూసింది. ఆ బొమ్మ యింకా అక్కడే వుంది. గులాబీరంగు ఒళ్లూ, నీలం కళ్ళూ, చిన్న ముక్కూ, ఎఱ్ఱటి చిన్న పెదిమలూ ఎంతో బాగుంది పాపాయి. నొక్కుల జుట్టుకూడ వుంది బొమ్మకి. ఈ అందానికి తోడు బొమ్మ గులాబీరంగు సిల్కుది బుట్ట గౌను కూడ వేసుకుంది. ముద్దొస్తూంది తన పాపాయి. ఇంకా తన పాపాయి అవలేదుగా. నిన్నటినుంచీ అడుగుతోంది తను ఆ పాపాయి బొమ్మ కొనిపెట్టమని. ఇంకా కొనిపెట్టలేదు నాన్న. ఒక్కటే బొమ్ముంది. అది ఎవరో కొనేసుకుంటారు త్వరగా కొనుక్కోకపోతే. ఛీ! నాన్న ఎప్పుడూ యింతే. ఇట్లా ఆలోచనలు సాగుతున్నాయి చిన్నారి బొజ్జిమనస్సులో.

బొజ్జి నాన్న రామయ్య రంగనాథంగారి ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. బొజ్జికి అమ్మలేదు. అందుకని బొజ్జిని తనతోపాటు పొద్దున్నే తీసుకు వెళ్ళి, సాయంత్రం తీసుకువస్తాడు. పొద్దున్నే యిద్దరూ గంజితాగి, అన్నం తీసుకుని వెడతారు. వాళ్ళు వెళ్ళేదారిలోనే బొమ్మలషాపు వుంది. పాపాయి బొమ్మలూ, కార్లు, విమానాలు, గొడుగు పట్టుకున్న బొమ్మలూ, డన్సుచేసే బొమ్మలూ, కుక్కలూ, పిల్లులూ, ఎన్నో రకరకాలు వున్నాయి. పాపాయి బొమ్మలు కొత్తగా వచ్చాయి. అన్నీ అయిపోయాయి, ఒక్కటే వుంది. అది కావాలనే బొజ్జి మారాం చేస్తూంది. రామయ్య సంపాదించే డబ్బు తిండికే చాలదు. ఇంక బొమ్మలెక్కడ కొంటాడు? అయినా అప్పుడప్పుడు మిఠాయి గానులు కొంటూండే వాడు. బొజ్జికి ఈసారి బొమ్మకొనాలి అనుకున్నాడు.

“నాన్నా, పాపాయిబొమ్మ కొనిపెట్టవూ” అని అడిగింది బొజ్జి. ‘రేపు కొనుక్కుందాములే’ అన్నాడు రామయ్య. ‘మళ్ళీ అయిపోతాయి కానీ’ అంది బొజ్జిబుంగమూతి పెట్టి.

రామయ్య షాపువాడిదగ్గరకు వెళ్ళి ఆ బొమ్మ ఖరీదెంత అని అడిగాడు. “అరున్నర” అని చెప్పాడు షాపువాడు. ‘రేపు తప్పకుండా

రెండవ బహుమతి కథ

# పాపాయి బొమ్మ

ఆమంచి. మనోరమ



కొంటానులే, పద బొజ్జీ, అంటూ బయలుదేరాడు రామయ్య, తను దాచిపెట్టినది మూడు రూపాయ లుంటుందేమో, ఎవర్నయినా మిగి లిన మూడు రూపాయలు అప్పడిగి

## పాపాయిబొమ్మ

అయినా బొజ్జికి బొమ్మ కొనిపెట్టా లనుకున్నాడు. మలుపు తిరిగే దాక వెనక్కి తిరిగి చూస్తూనే వుంది బొజ్జి సాయంత్రం కూడ బొమ్మకోసం చూసింది, పాపాయి బొమ్మ అక్కడే వుంది.

ఆ రాత్రంతా బొజ్జికి పాపాయి

ఆలోచనలే. పాపాయిని ఎప్పుడూ వదలి పెట్టకూడదు. ఎత్తుకు తిరగాలి. నీళ్ళుపొయ్యాలి. పడుకోబెట్టాలి; అనుకుంటుంది. రేపు తప్పకుండా నాన్న బొమ్మకొనిపెడతాడు, అనుకుంది.

తెల్లవారింది. రామయ్య పక్క వాళ్ళని అడిగి మూడురూపాయలు సంపాదించాడు. ఆరు రూపాయలయ్యాయి. ఇంక అర్ధరూపాయేగా లేనిది, బేరమాడవచ్చు అనుకున్నాడు. రామయ్యా, బొజ్జి బయలుదేరారు. మలుపు తిరిగారు. అదిగో, షాపులోంచి బొమ్మలు కనిపిస్తున్నాయి. కాని, పాపాయి బొమ్మ ఏది. కనిపించలేదు. బొజ్జికి భయమేసింది. రామయ్య షాపు వాడిని అడిగాడు పాపాయి బొమ్మ ఏదని. 'రంగనాథంగారి అమ్మాయి కొనుక్కుంది' అన్నాడు. బొజ్జి ఏడుపు ప్రారంభించింది. ఇంకేదైనా బొమ్మ కొనిపెడతానన్నాడు రామయ్య. 'అక్కర్లేదు' అంది బొజ్జి. ఇద్దరూ ఫ్యాక్టరీవైపుకి బయలుదేరారు. బొజ్జికి చాల కోపంగా వుంది నాన్నమీద.

రామయ్య లోపలకు వెళ్ళిపోయాడు. బొజ్జి ఫ్యాక్టరీ దగ్గరగా యిసకలో కూచుంది. నాన్న ముందరే పాపాయిబొమ్మ కొని వుంటే బొమ్మ తనది అయ్యేది. ముందర కొనలేదు. ఎవరో కొనేసుకున్నారు. ఇంకేదో వెధవబొమ్మ ఎవరిక్కావాలి? వెధవ కోతి బొమ్మ, కొంగ బొమ్మ ఏం బాగుంటాయి. అట్లాగే కోపంగా కూచునుంది బొజ్జి. ఇంతలో అక్కడికి ఒక కారు వచ్చి ఆగింది. అందులోంచి రంగనాథంగారు దిగి లోపలి కెళ్ళిపోయారు.



గోపాలకృష్ణుడు

ఒక ఆరేళ్ళమ్మాయి మంచిబట్టలు కట్టుకుని కారులో కూచుని చాల బొమ్మలు పెట్టుకు ఆడుకుంటోంది. బొజ్జి కారుకుదగ్గరగా వచ్చి చూస్తోంది. అదిగో పాపాయి బొమ్మ కూడ వుంది. అయ్యో అదేమిటి ఆ అమ్మాయి పాపాయి బొమ్మని అలా పడేస్తుంది. ఆ అమ్మాయికి పాపాయి అంటే యిష్టంలేదులావుంది. ఆ దొర బొమ్మనే ఎత్తుకుంటోంది. ఇలా అనుకొంటూ చూస్తోంది బొజ్జి. ఆ అమ్మాయి బొజ్జిని చూసింది. 'లోపలికిరా, ఆడుకుందాము' అందిం. బొజ్జి కారెక్కింది. 'నాకు ఎవరూ ఆడుకుందుకి లేరు. నువ్వూ నేను జట్టు' అంది. 'ఓ' అందిబొజ్జి. 'మనిద్దరం రోజూ ఆడుకుందాం. నీకు వీటిలో ఏ బొమ్మ కావాలంటే, అది తీసుకో' అంది అమ్మాయి. అనడమే తడవుగా పాపాయి బొమ్మని చూపించింది బొజ్జి. తీసి యిచ్చింది ఆ అమ్మాయి. బొజ్జి ఆనందంగా పాపాయిని ఎత్తుకుంది.

ఇంతలో రంగనాథంగారు రామయ్య వచ్చారు. బొజ్జిని కారులో చూసి, చేతులో బొమ్మ చూసి రామయ్య భయపడ్డాడు. 'ఎవరమ్మా ఈ అమ్మాయి రాధా' అని అడిగారు రంగనాథంగారు. 'నా స్నేహితురాలు నాన్నగారూ' అంది రాధ. బొమ్మని ఎవరయినా ఎత్తుకపోతారేమోనని గట్టిగా పట్టుకుంది బొజ్జి. వాళ్ళిద్దరినీ చూసి రంగనాథంగారు ముచ్చటపడ్డారు. ఆ రోజునుంచీ వాళ్ళిద్దరూ స్నేహితులయ్యారు. బొజ్జికి తన పాపాయి బొమ్మ దక్కింది. ★

# ★ నాటక ప్రముఖులు ★

(40 వ పేజీ తరువాయి)

నాటకం చూచి అభినందించేటందుకు తమతమ తమ్ముళ్లను, చెల్లాయిలను ఆహ్వానించారు. ప్రేక్షకులు ఎంతో ఉత్సాహంతో నిశ్శబ్దంగా కూర్చున్నారు.

తెర వెనుకకు వెళ్ళారు నాటక ప్రముఖులు. అన్ని వరతుల ప్రకారం రంగులు వేసుకొనటం పూర్తయింది. రాజ కృష్ణుని 'కేరక్టర్' తీసుకున్నాడు. ఆ నీలంరంగు వేసుకున్న రాజు శరీరం కిటికీలోనుంచి ప్రసరించే ఎండకు తళ తళ మెరుస్తోంది.

తెర తొలగింది. కృష్ణపరమాత్మ వచ్చి తన ఆసనం మీద ఆసీనులయ్యారు ఎంతో ఠీవిగా. ఇంతలో అర్జునుడు ప్రవేశించాడు: "నమస్కారం దేవేంద్రా" అన్నాడు. "అధైర్యపడకు అర్జునా! ముల్లోకాలను పరిపాలించే ఈ కృష్ణుడు నీకు రథసారథిగా వుంటే నీకు భయమెందులకు?" అన్నాడు కృష్ణుడు.

నాటకం చాలా జోరుగా సాగిపోతోంది. కాని ... మధ్యలో ...

"పాండవులు బలహీనులనుకున్నావేమో కానీ మా పాండవులు బలహీనులు కారయా బావా!..." అన్నాడు ఒక నాటకప్రముఖుడు చాలా గంభీరంగా.

ఇంతలో వీధి తలుపు కొట్టి ఆ చప్పుడయింది. సందేహం లేదు. న గొంతు రాజు తండ్రిదే. కాలం కర్మ కలిసి రానట్లు ఆయన గూడా అప్పుడే రావాలి! ఆయనంటే అసలే అందరికీ హడల్. అందులో ఇటువంటి సమయంలో వచ్చాడంటే వాళ్ల ప్రాణాలు పైనే యెగిరిపోయినయ్. కన్నుమూసుకుని తెరిచేటంతలో "ఎక్కడి దొంగలు అక్కడే గప్ చిప్..." అన్న సామెత అయింది.

ఈహడావుడిలో కృష్ణపరమాత్మ కుర్చీలోనుంచి లేచేటప్పుడు కంగారుపడి వెనక్కు పడిపోయాడు. పాపం.

ఇంతసేపూ చాటుగా నుంచుని చూస్తున్న రాజుతల్లి ఇహ నవ్వాపుకోలేక ఫక్కున నవ్వేసింది.



# నాటక ప్రముఖులు

"గోరుచుట్టుమీద రోకటి పోటు" అన్నట్లు దీంతో మరీ కంగారు పుట్టింది నాటక ప్రముఖులకు. అక్కడనుంచీ దొడ్లోకి పారిపోయారు.

* * *

అప్పుడే లోపలికి వచ్చిన రంగనాథంగారి ముఖం కోపంతో ఎర్రబడింది. "ఈ పంచెలన్నీ ఇలా తెర








కట్టారేమిటి? అయ్యో ఇంటి నిండా ఈ రంగులేమిటి? ఈ కుర్చీలన్నీ ఇలా వేశారేమిటి? ఆదివారం సెలవు వచ్చిందంటే చాలు, గోలచేస్తారు. ఛీ...ఛీ...పరీక్షలు దగ్గర కొస్తున్నాయి గదా, చదువూ, సంధ్యా అక్కర్లేదూ? బుద్ధిలేని వెధవలకు" అంటూ ఏమేమో కేకలేస్తున్నారు కుర్చీలో చతికిల బడుతూ.

"అది కాదు నాన్నా! అన్నయ్యావాళ్లే నాటకం వేశారు. భలే బాగుంది నాన్నా నాటకం. మరేమో ... అన్నయ్యేమో కృష్ణుడు వేషం ఎంత బాగా వేశాడనుకున్నావ్. అన్నయ్య వేషం వేసుకొచ్చి కుర్చీలో కూర్చోగానే నిజంగానే దేముడనుకుని నేను దణ్ణం పెట్టేశా నాన్నా" అంది వచ్చీరాని మాటలతో రాజు చెల్లాయి.

"నిజమేనండీ, ఎంత బాగా వేశారనుకున్నారు నాటకం. ఈ వెధవలు ఇంతటివాళ్లని నేనెప్పుడూ అనుకోలేదు. అందులోనూ మన రాజు కృష్ణ వేషంలో ఎంత బాగున్నాడనుకున్నారు" అంది, లోపలినుంచి వస్తూ రాజు తల్లి.

సామాన్యంగా చాలామందికి తమ పిల్లల్ని పొగడటం వింటుంటే యెంతకోపమైనాసరే, నిప్పుమీద నీరు చల్లినట్లు నిముషంలో చల్లారిపోతుంది. అదే విధంగా ఈ పొగడ్తలు రంగనాథంగారి మీద కూడా బాగా పనిచేశాయి.

"రాజూ, రామూ, మీరంతా యిలా రండిరా," అని దగ్గరగా పిలిచారు ఎంతో సౌమ్యంగా. అసలే హడలిపోతున్న ఆ పిల్లలు మరీ గడగడలాడిపోయినారు. కానీ మళ్లీ



పండగకు తలంటి -

—ఫొటో ఎన్. రామకృష్ణ.

పిలిచేసరికి తప్పనిసరై యమధర్మరాజు యెదుట నిలబడినట్లు నిలబడ్డారు ఆయన ఎదుట.

"అసలు మీ బుర్రలకు నాటకం వేయాలని బుద్ధి ఎలా పుట్టిందిరా?" అన్నారాయన కొంచెం గంభీరంగానే.

"మాట్లాడరేమిరా?" అంటూనే ఆయన జేబులోకి చేతులు పోనిచ్చి నాలుగు అర్ధరూపాయిబిళ్లలను పైకి తీశారు. ఒక్కొక్కరి చేతులో ఒక్కొక్క బిళ్ల ఉంచుతూ ... "ఇవిగో తీసుకోండి. మీ నాటకానికి బహుమతి" అన్నారాయన ప్రేమగా.

ఇదంతా చూస్తున్న ప్రేక్షకులు గట్టిగా చప్పట్లు చరిచారు. నాటక ప్రముఖులు నలుగురూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకుని నవ్వుకున్నారు. 



# మా స్కూలు

బాలలసంఘం 'బి' వర్గం
పోటీలో మొదటి బహుమతి రచన

కర్రా సీతామహాలక్ష్మి (పాలకొల్లు)

మా పాఠశాల మా ఇంటికి చాల దగ్గరగా యున్నది. మా పాఠశాల ప్రక్కన కుళాయిచెరువు గలదు. మా పాఠశాల దగ్గరగా కుళాయికూడ కలదు. చుట్టుప్రక్కల పెద్దపెద్ద ఇండ్లుకూడ గలవు. మా పాఠశాలను శింగోడియన్ దొరగారు కట్టించిరని నేను వినియున్నాను. మా పాఠశాల పెంకులతో కట్టిన ఇల్లువంటిది. మా పాఠశాల చుట్టును గోడలతో కట్టిరి. నేను బడిగంట కొట్టుటకు ముందుగనే బడిలోనికి వెళ్ళుదును. మా బడిలో గంట కొట్టగానే నేను ప్రార్థన పాడుదును. అందరు పిల్లలును కలిసి నాతోకూడ పాడుదురు. తరువాత మా మేష్టారికి ఇంటికి ఇచ్చిన చూచివ్రాత, కాపీ, చూపెట్టి పాఠములు అప్పచెప్పుదుము. మా బడిలో చాలమంది పిల్లలు పొట్టిగను కొందరు నాకంటె పొడుగుగాను మాబడిలో యుండిరి. ఒక ఆడమేష్టారు ఐదుగురు మగ మేష్టర్లు కలరు. మా బడిలో ఒకటవ తరగతి రెండు క్లాసులుగా యున్నవి. ఆడమేష్టారు రోజు సాయంత్రము అవుటుగంట కొట్టిన తరువాత పాటలు నేర్పుదురు. మా బడిలో లెజిమ్ము అనే కొత్తఆట క్రొత్తగా ఈ ఏడాదే పెట్టినారు. ఆ ఆటకు కావలసిన పిల్లలను నాలుగు ఐదు తరగతులలో వుండే కొంతమంది ఆడపిల్లలను మా పెద్ద మేష్టారు గారుతీసుకొనిరి. అందులో నేనుకూడ వున్నాను. రోజు సాయంత్రం మాకు అవి నేర్పుచున్నారు. కోలాటం, తకిలి, రాట్నము కూడ కలవు. ఇంకా చిన్న చిన్న ఆటను మొదటి తరగతికి, రెండవ తరగతికి, మూడవ తరగతికి, నేర్పుచున్నారు. సాయంత్రము మూడవతరగతి పిల్లలను ఆటస్థలము లోనికి తీసుకుపోయి ఎక్కాలు పిల్లలచేత చెప్పించుదురు. అట్లు చేసిన పిల్లలకు ఎక్కములు వచ్చునని వారి యూహ అనుకొందును. మా బడిలో ప్లసు గుర్తు ఎఱ్ఱని రంగువేసిన ఒక పెట్టె యందు వ్రాయబడినది. అది నాకు తెలియక మా మేష్టార్ని అడిగితే దానిపేరు రెడ్ క్రాస్ సంఘమునకు గుర్తు అని చెప్పినారు. దాని ఉపయోగ మేమిటో నాకు తెలియక మేష్టార్ని అడిగిన చిన్న చిన్న గాయములకు మందులు వేయుదురు అని చెప్పినారు. మా పాఠశాల యందు ఒక చిన్న తోటకూడ గలదు. అందు ప్రతిరోజు నీరుపోసి మొక్కలను, పాదులను, పెంచుచున్నాము. సాయంత్రము ఇంటిగంట కొట్టువరకు ఉండి తరువాత ఇంటికిఅందరమువచ్చివేయుదుము. ★

చిన్నవాళ్ళు కబడ్డీ ఆడారు. నేను కబడ్డీ ఆడలేదు. మాకు ఇవాళ 2 వ పీరియడ్ డ్రాయింగ్ ఉన్నది. ఇవాళ మా స్కూల్లో ఫుట్ బాల్ మేచ్ అయింది, టీచర్లు ఆడారు, స్టూడెంట్సు ఆడారు. మాకు ఒక పీరియడ్ లీవు ఇచ్చారు.

మా స్కూలుదగ్గర కొందరు బీదవాళ్ళు బిళ్ళలు, చూయింగు చాక్లేటులు, పెనిసిళ్ళు, రబ్బర్లు అమ్ముతారు. మా స్కూల్లో చాలా మంది బీదవాళ్ళు చదువుకుంటున్నారు. మాస్టార్ వాళ్ళకోసం పైసలు చందా అడిగారు. నేనూ ఇచ్చాను. ★

## (హైదరాబాద్)

మా స్కూలు మెథడిస్టు బాయిస్ మల్టిపర్పస్ హైస్కూలు. మా స్కూలు చాలా పెద్దది. ఇంకా పెద్దగా కడుతున్నారు. మాస్కూల్లో ఒక అంతస్థు మేడలు రెండుఉన్నవి. రెండు అంతస్థుల మేడలు రెండు ఉన్నవి. ఒక మేడలో బోర్డింగు పిల్లలకి గదులు ఉన్నాయి. గేటునుంచి రెండు మూడు గజాల దూరం వెళ్లితే మా ప్రిన్సిపాలుగారి ఆఫీసు వస్తుంది. దానిముందు ఒక చక్కని గార్డెను ఉన్నది. గార్డెను మధ్యలో ఒక ఫౌంటెన్ ఉన్నది. ప్రతి క్లాసుకీ రెండేసి అలమారాలు ఉన్నాయి. ఐదు కిటికీలు ఉన్నాయి. మూడు వరసల బెంచీలలో పిల్లలు కూర్చుని ఉంటారు. మా స్కూల్లో చాలా చెట్లు పెరిగాయి. లోపల ఒక పెద్ద గ్రౌండు ఉన్నది. ఒక లైబ్రరీ ఉన్నది. మేము లైబ్రరీనుంచి పుస్తకాలు తీసుకుంటాము. మాస్కూల్లో 12 వ క్లాసువరకు ఉన్నది. స్కూల్లో చాలామంది బోర్డర్లు ఉన్నారు.

మా ప్రిన్సిపాలుగారు చాలా మంచివారు. ఆయనకు ఒక కారు ఉన్నది. మా క్లాసుటీచరు చాలా మంచివారు. మాహిస్టరీసారు చాలా గమ్మత్తు చేస్తారు. నైజాముకి 300 భార్యలు ఉన్నారని మా హిస్టరీ సారు చెప్పారు.

మా స్కూలు 10 గంటలకి మొదలుపెడతారు. మాకు మంగళవారము ఆఖరి పీరియడ్ లేదు. టీచర్లకు మీటింగ్. నేను 5 వ క్లాసు చదువుతున్నాను. నాకు డబుల్ ప్రమోషను ఇచ్చారు.

ఇవాళ మాకు 1వపీరియడ్ డ్రిల్లు. మా క్లాసువాళ్ళు గ్రౌండులో ఫుట్ బాల్ ఆడారు. నేనుకూడా ఆడను.



మహిషాసురుడు (మైసూరు)

—ఫోటో: ఎస్. రామకృష్ణ









# అల్లుడి మంచితనం

[36-వ పేజీ తరువాయి]

ఇద్దరు పిల్లల తల్లి అయ్యాక సంగీతం కూడా మొదలుపెట్టింది. పెళ్ళితో ఆ చదువు చాలని ఆపించిన బావ, ఇప్పుడు మేష్టరుని పెట్టి సంగీతం నేర్చుకోవాలనే సత్య కోరికను తీరుస్తున్నాడంటే ఆశ్చర్యంగా ఉంటుంది. ఇదంతా సత్య బావలో తీసుకువచ్చిన మార్పు కాబోలు. కాని లలిత క్కయ్య తప్పు చేసిందని నాకు అనిపించదు. చిన్న బావలాగ అందరూ మారతారని ఎట్లా చెప్పగలం! అయినా మధురంగా గడపవలసిన కాలమంతా నిర్జీవంగా వృథా అయిపోవటం లేదూ. అక్కయ్య అన్నట్లుగా అందరూ బ్రతుకుతారు ఎట్లాగో ఒకలాగ. కాని సంస్కృతి అంటూ ఉంటే జీవితాన్ని కళాత్మకంగా చేసుకుని ఆనందించాలి. లలితకి ఆ చిన్న వయసులోనే అన్ని భావాలు!

బావ ఊహకి ఆ లోతులు అందవు. లలిత కోపంగా కాని, ముభావంగా కాని ఉంటే "కొత్తచీర కావాలా? ఆడవాళ్ళు అలిగేది ఎందుకోకదా" అంటాడుట.

అక్కయ్య మూడవ కథ చెప్పింది.

"ఆ రోజు ఇద్దరు స్నేహితుల్ని తీసుకు వచ్చారు. లోపలికివచ్చి, "ఒక గంట ఉంటారు. త్వరగా ఒక స్వీట్, హాట్, కాఫీ తయారు చెయ్యాలి" అన్నారు. ఫలహారం కాఫీ తయారుచేశాను. లోపలకువచ్చి "కొంచెం మొహం కడుక్కొని, ఫలహారాలు తీసుకురా" అని వెళ్లారు. ఫలహారాలు అందించి అక్కడే కూర్చున్నాను.

వాళ్లు చిన్ననాటి స్నేహితులు. సరదాగా మాట్లాడుకుంటున్నారు. నాకు కొత్తగా ఉంది. "అట్లా ఉన్నావేం?" అని వాళ్లో "మా ఆవిడ స్కూల్ ఫైనల్ చదివిందన్న మాటేగాని భోలెడంత సిగ్గు" అన్నారు.

ఒకతను నవ్వాడు. ఇంకొకతను "అది సహజమే" అన్నాడు.

ఆయన మైసూర్ పాక్ అప్పుడే నోటిలో పెట్టుకున్నారు.

"ఏమిటి ఇట్లా ఉంది. నెయ్యిచాలలేదు. అయినా ఎవరి నావస్తే మరీ పాడుచేస్తావు" అన్నారు. నేనేమైనా కావాలని పాడు చేస్తానా! పదేళ్ళనుంచీ కాపురం చేస్తున్నా నా వంటల్లో ఆరితేరటానికి. నాకు ఈ పనులన్నీ కొత్త అనే సానుభూతి ఆయనలో లేదు. నా మనసులో బాధ వేసింది.

"అట్లాగవకు రఘూ. చెప్పాలంటే చాలా బాగుంది. ఇంకా కొత్త, చూడు" అన్నారొకాయన. నాకు కళ్ళలో నీరు తిరుగుతుంటే కాఫీ చెయ్యాలని వచ్చేశాను. ఎంతసేపటికీ నేను కాఫీ తీసుకు వెళ్లలేదని ఆయన వచ్చారు.

"నేను తీసుకురాను. మీరు తీసుకు వెళ్ళండి" అన్నాను.

"ఏం సిగ్గా? చదువుకున్నదానికి సిగ్గేం దుకు?" అన్నాను.

"వాళ్ల ముందర మీర నేమాటలుపడ లేను" అన్నాను కోపంతో. కాని నా మన సెట్లా వుందో, నే నే పరిస్థితిలో ఉన్నానో ఆయన ఏమీ గుర్తించలేదు. వాళ్లతో కలిసి సినిమాకి వెళ్ళారు. అంతే. నా ఆలోచన ఆయనకు ఎప్పుడూ ఉండదు.

ఒకసారి జ్వరం వచ్చింది. హోటల్లో భోజనం చేసివారు. లేవలేనిపరిస్థితి వచ్చేదాక నేనే వంటచేశాను కాని, "వంట చెయ్యగలవా?" అని అడగనైనా లేదు.

జ్వరం నార్మల్ కి వచ్చింది. నాలుగు రోజులనుంచీ ఆహారం లేకపోవటంవలన నీరసంగా ఉంది.

"ఆకలి వేస్తోందా?" అడిగారు. "ఊ" అన్నాను.

"నార్మల్ కి వచ్చిందిగా. పథ్యం తినొచ్చు," అని వెళ్ళిపోయారు. హోటల్ కి వెళ్ళి, ఆఫీసుకి వెళతారు. సాయంత్రం వస్తారు. నేను పథ్యంతినాలి, వండుకోవాలి. మంచంమీదనుంచి లేవటానికే నా బలం లేదు. అమ్మగుర్తుకొచ్చింది. ప్రేమ అంటారు. ఏమిటి ప్రేమ, అందంగా ఆరోగ్యంగా ఉన్నప్పుడు సరదాగా కబుర్లు చెప్పుకోవటమా, షికారుకి వెళ్ళటమా? లేక ఆపేరుచెప్పి అవసరాలు తీర్చుకోవటమా?

జ్వరంవచ్చిన మరునాడు డ్రెస్ అవుతున్నారు పొద్దున్న. దగ్గరకువచ్చి

"అంత ఎక్కువ లేదనుకుంటాను" అన్నారు.

"అవు" అన్నాను, వారిప్రయత్నం తెలుసు కనక.

"అంటే మరేమీ భయపడనవసరం లేదు లలితా!" అన్నారు.

"ఎందుకూభయం?" అన్నాను, విరక్తిగా నవ్వుతూ.

"మరి మంచి ఇంగ్లీష్ పిక్చర్. ఒక్క షో మాత్రంఉంది. వెళ్లకపోతే ఇంక చూడలేను. ఏమీ అనుకోవుకదూ."

## అల్లుడి మంచితనం

"నేనేమనుకుంటే మీకు ఏమిటి?" అని అన్నాను.

"అట్లాగయితే నేనువెళ్లను" అన్నారు. అట్లాగే బలవంతంగా ఆపటం నాకూ ఇష్టం లేదు.

"ఏమీ అనుకోను వెళ్లండి" అన్నాను.

"నాకు తెలుసు. నువ్వు మంచిదానివి లలితా" అన్నారు. అయినా నాకు సంతోషం కలిగించలేదు. వెళ్తూతూ,

"ఒకమాట. ఎవరినావస్తే సినిమాకి వెళ్లానని చెప్పకు బాగుండదు" అన్నారు.

ఆయన వెళ్లిపోయారు. పడుకునిఉన్న నాలో అనేక ఆలోచనలు వేధించసాగాయి. చివరికి "ఔను ఏదో మామూలు జ్వరం అదే తగ్గిపోతుంది. కనుకనే నన్ను వదిలిపెట్టి ఆయన వెళ్లగలిగారు. విషయం ఇంతచిన్నదికదా అంత బాధపడటం దేనికు. ప్రతిదానికి ఆయన ప్రవర్తనలో లోపాలు వెతుకుతుంటే మనసుకి శాంతి కూడా ఉండదు. నిజమే నాకు జ్వరం వచ్చిందని సెలవుపెట్టారు కాని, ఇంట్లో తోచలేదు. అందుకని వెళ్లారు"అని మనసును సరిపెట్టుకున్నాను.

కాని ఈరోజు అనంతా గుర్తువచ్చింది. ఆయనకి నామీద నేననుకునేంత మమకారం లేదేమో అనేశంకతో మనసు వికలమయింది. పక్కఇంటి ఆవిడ చూడటానికివచ్చింది.

"ఎట్లాగఉందమ్మా లలితా?" అంది.

"జ్వరం తగ్గిందండి" అన్నాను.

"నీరసంగా ఉన్నావు పత్యం ఎప్పుడు తింటావు? పోనీ బ్రెడ్ తీసుకోవచ్చుకా" అని ఆవిడ అంటుంటే నాకు మరీదుఃఖం వచ్చింది.

"పథ్యం తినమని ఆయన ఆఫీసుకి వెళ్లారు" అన్నాను.

"ఎట్లా తింటావనుకున్నాడమ్మా. పోనీ నాకు కబురుచెయ్యకపోయావా? ఉండు, మాకుర్రవాడిని పంపిస్తాను. కాస్త బ్రెడ్ తింటే ఓపికైనావస్తుంది" అని ఆవిడ వెళ్లింది.

ఈ ఆదరణ ఆయన చూపిస్తే నాకెంత ఆనందంగా ఉంటుంది!

సాయంత్రం ఇంటికి వచ్చారు.

"ఆలస్యమయిందనుకుంటున్నావా? అయ్యర్ హోటల్‌కి వెళ్లివచ్చాను. మసాలా దోసె చాలా బాగుందిలే. ఎట్లాగూ నువ్వు ఫలహారం చెయ్యలేవు ఇవేళ" అన్నారు.

నే నేమీమాట్లాడలేక పోయాను. ఎందుకో కాని అసహ్యం వేసింది. నామీద నాకే విరక్తి కలిగింది.

"అన్నం తిన్నావా?" అనడిగారు. "ఆ" అన్నాను.

"అయితే ఇంక హోటల్ కి వెళ్ళనవసరం లేదు అన్నారు.

ఆయన స్వభావం అంతే; నేనంటే ఇష్టమే అని మనసును తృప్తిపరచుకోవాలని ప్రయత్నించేదాన్ని. కాని ఇటువంటి చిన్న విషయాలలో నాకు ఏమీ తృప్తిదొరికేదికాదు. నన్ను నేను మోసంచేసుకుంటున్నా నేమో అనిపించేది.

నాకు తెలుసు లలిత భావనుగురించి ఎట్లా ఊహించుకుందో! కథలో నాయకుడు రాజకుమారిని ఆరాధించి ప్రేమించినట్లు తనను చూసుకోవాలని. జీవితాన్ని తీయని కలలాగ చేసుకోవాలని. కాని బావ లోకంలో మనిషి. లలిత సరిపెట్టుకోలేదు. అతడి ప్రతిపనిని, మాటని త్రాసులో వేసి తూస్తుంది అక్కయ్యకి నిరాశేమిగులుతుంది.

"అక్కడికివెళ్ళాక నాకు ఒకటైనా ఉత్సాహకరమైన విషయం కనిపించలేదు. పదహారేళ్ళకే నా జీవితమంతా ముగిసిపోయిందా అని నాకు బాధతోచి ఏడుపు వస్తూంటుంది" అంది.

పత్యేకిమాత్రం కోరికలు లేవా? చిన్నప్పుడు మా అందరిలోకీ సత్య చాలా చురుకుగా ఉండేది. అందరితో కలిసి మెలిసి ఉండాలనే స్వభావం. సంగీతం అంటే ప్రాణం దానికి. తన స్నేహితురాలు ఒకమ్మాయి స్కూలులో టీచర్ గా పని చేస్తుండేది. ఒకరోజు జ్వరంవస్తే ఆ పిల్లని చూడటానికి వెళ్ళింది. బావ ఇంటికివచ్చాక చెప్పిందిట.

"ఎందుకు వెళ్ళావ్?" అన్నాడుట బావ. అప్పటినుంచి అక్కయ్య మళ్ళీ ఎవరింటికీ వెళ్ళలేదు ఒంటరిగా.

ఇప్పుడు బావ అంటాడు: "మనం సంఘజీవులం. అందరితోటీ సోషల్ గా ఉండాలి. ఎక్కువేమిటి? తక్కువేమిటి? అందరం మనుష్యులమే. ఎవరి ఆత్మగౌరవం వాళ్ళకి ఉంటుంది" అని. ఇద్దరూకలిసి స్నేహితుల ఇళ్ళకి వెడుతూ ఉంటారు.

"మానవులమై పుట్టినందుకు ఆధిక్యత ఏమిటి? ఈ సృష్టిలో ఇతరజంతువులకు లేని మనసు, ఆత్మలను భగవంతుడు మనిషికి ఇచ్చినందుకు సార్థకత ఏమిటి? ఔన్నత్యం కోసం నిరంతరకృషిచేయమే జీవితోద్దేశం! అటువంటిది, ఏ అన్వేషణా లేని జీవితం గడుపుతుంటే వేదనకలిగేది. నా జీవితం పతనమయిందనే దుఃఖం కలిగేది. ఎట్లాగ నన్ను ఉద్ధరించుకోవటం అని ఆలోచిస్తుండే దాన్ని" అంది లలిత.

"నీకు ఏం తక్కువచేశావని అట్లాగ దిగులుగా, నిరుత్సాహంగా ఉంటావు" అనడిగాడట బావ.

"ఏమో నాకు తెలియదు. జీవితంలో ఎప్పుడు శోధించి సంపాదించవలసినదేదో ఉందనిపిస్తుంది నాకు" అని లలిత అంటే బావ వెటకారంగా నవ్వి,

"అయితే అన్వేషణకు బయలుదేరు" అన్నాడుట.

చాలాసేపటివరకు ఏమిమాట్లాడాలో లలితకు తెలియలేదు. ఆ వెటకారంవలన కలిగినబాధ అణిగిపోయాక,

"నా అన్వేషణలో మీకు కుతూహల మేమీ ఉండదా?" అందిట.

"ఉండదు. నువ్వు తెలివైనదానివి. మాకు ఆత్మ, మనసు లేవు."

"నాకు ఎంత అశాంతిగా ఉందో మీకు తెలుసా?"

"ఆ తెలుసు. నాకుకలిగే అశాంతివలన తెలుస్తోంది" అన్నాడుట బావ.

"ఔనేమో, నానరాన్ని నెరవేర్చలేక పోతున్నానేమో. కొన్నాళ్ళు అమ్మ నాన్నాదగ్గర ఉంటాను. నాబాధని మీరు ఎప్పటికైనా అర్థంచేసుకుంటే నేను కోరుకునేది మీదగ్గరకు రావాలనే" అందిట లలిత.

* * *

ఆరోజు పొద్దున్న వరండాలో కూర్చుని నాన్న 'గీత' చదువుతున్నారు. అక్కయ్య కాఫీతీసుకుని వచ్చింది.

"ఇంకో ఒకశ్లోకం ఉందమ్మా. కాఫీ వేడిగా ఉందా?"

వేడిగా ఉందని చెప్పి అక్కడేకూర్చుంది లలిత. నాన్న కాఫీత్రాగాక హఠాత్తుగా ప్రశ్నించింది.

"వివాహ వేళలో భార్యాభర్తల మధ్య జరిగే ప్రమాణమేమిటి నాన్నా?" అని.

అక్కయ్యకి పదహారవయేట పెళ్ళిజరిగింది. నిజమే, ఆవయసులో వివాహానికి అర్థం తెలియదు. తాము ఏమని ప్రమాణం చేస్తున్నామో తెలియకుండానే ప్రమాణం చేస్తారు. లేకపోతే వివాహాలు దుఃఖాంతాలు ఎందుకవుతాయి. నాన్న శ్లోకం చదివి విపులంగా చెప్తున్నారు.

"సరే నాన్నా! ధర్మ సంతోషంకోసం సుఖదుఃఖాలలో సమంగా వర్తిస్తుంది భార్య. మరి భార్యయొక్క ఆనందం భర్త విధి కాదా నాన్నా? విడిచి ఉండనని ప్రమాణం చేస్తారు. కాని, భార్యఅంటే శ్రద్ధ ఉండదు. ఆమె ఉన్నతిని చూస్తే అసూయ. ఇంక అతనిలో ఏ మార్పయినా వస్తుందనే ఆశకూడా ఉండదు. ఆ పరిస్థితిలో కర్తవ్యం ఏమిటి నాన్నా? సరే, అన్నీ సహించి అతనిదగ్గరే పడి ఉంటానను కుందాము. ఫలితమేమిటి నాన్నా! అతనిలో జాగృతి కలగదు. జీవితమంతా ఆ విధంగా మరుభూమిలో ఇంకిపోవలసిందేనా? అంతకంటే నా తృప్తికోసం ఇతర కలాపాలలో జీవితం గడపటంతప్పా? మనసు లేనిది జీవితాన్ని అర్పించలేము కదా. నాట కందేనికి నాన్నా? మనసులో ఎంతో ఘర్షణ జరుగుతుండేది. వచ్చేశానా, ఇప్పుడు పొరపాటు చేశానేమో అనిపిస్తుంది."

"ఎందుకమ్మా అట్లా గనుకుంటావు."

లలితమనసులో బాధ నాన్నకి తెలుసు. ఆయన లోలోపల కరిగిపోతుంటారు.

"స్వార్థం చూసుకుని, ధర్మం విడిచి వచ్చాను. నాధర్మం నిర్వహించగల నిగ్రహం, ఔన్నత్యం నాలో లేవని నాకిప్పుడు అనిపిస్తుంది నాన్నా! వారు ఎట్లాంటివారైనా సరే సహించి, ఉన్నతో అధోగతో జీవితం అక్కడే అంతం కావటం మేలని పిస్తోంది. మళ్ళీ వెళ్ళటం అనేది జరిగితే, నేను నేర్చుకోవలసింది ఇదే నాన్నా."

శరత్ 'అన్నదా' గుర్తు వచ్చింది. అది చదివినప్పుడు అట్లాంటి వాళ్ళుంటారా అని నవ్వుకున్నాను కాని లలితమాటలు నన్ను నిలువునా కదలించివేశాయి. కన్నీళ్ళు తిరిగాయి.

బావ ఉత్తరాలు రాసేవాడు కాదు. అక్కయ్య తనంతట తను వచ్చేసింది కదా, బావ ఎందుకు రాయాలి! లలిత చదువుకుంటుంది అని నాన్న ఉత్తరం వ్రాస్తే దానికి బావ జవాబేమీ వ్రాయలేదు. అప్పటి నుంచి ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు. కాని లలిత, బావ సంగతులు ఏమైనా తెలుస్తాయేమోనని ఎదురు చూస్తుండేది. లోపల లలితకి బావఅంటే అంత ప్రేమ ఉంది. రాజకుమారిని రాజకుమారుడు తన ముద్దుతో మేల్కొలిపాడు తన ఎడబాటుతో బావలో మేల్కొలుపు తీసుకురావాలని అక్కయ్య దీక్ష.

లలిత పేపర్ చదువుతుంటే,

"అబ్బో, పేపర్ చదువుతున్నారు రాణీగారు. ఇంగ్లీషు వచ్చని చెప్పుకోవటానికి," అంటాడుట బావ. లలితకి ఇంగ్లీషు పుస్తకాలు చదవాలని, మంచిభాష నేర్చుకోవాలని ఎంతో కుతూహలంగా ఉండేది. ఈ

అపహాస్యాలకి గ్రుంగిపోయేది.

"ఒకరికోసం, గొప్ప కోసం పనులు చెయ్యటం నా కలవాటు లేదు" అని పేపర్ పడేసి వెళ్ళేదిట.

ఎక్కడికైనా స్నేహితుల ఇళ్ళకి వెడితే బావకి కోపంట. అది ప్రదర్శిస్తాడు. కాఫీ ఇస్తే,

"అక్కడ పడెయ్యి" అంటాడుట.

"చల్లారిపోతుంది" అంటే,

"నీకు బాధ ఎందుకు?" అంటాడుట.

లలితకి కళ్ళలో నీరు తిరుగుతాయి అక్కయ్య కుసుమంలాగ మెత్తనిది; బావ వజ్రంలాగ కఠినమైనవాడూను.

"ఎంతో ఆదర్శంగా ఉండాలనుకున్నాను. ఇంత చిన్న పిల్లతనంగా, అసూయగా ప్రవర్తిస్తా రేమిటి?" అని బాధపడుతుంది లలిత.

పన్నెండవ యేటనే వీణ మొదలు పెట్టింది లలిత. పెళ్ళినాటికి బాగా వాయిస్తుందని పేరుతెచ్చుకుంది. పెళ్ళి చూపులలో పాడించారు. పెళ్ళిలో చిన్న కచేరీ జరిపించారు. కాని బావ ఎప్పుడూ వీణ వాయించమని అడగడుట. "నా స్నేహితురాళ్ళు వస్తే కొంచెంసేపు సరదాగా గడిపేవాళ్ళం. ప్రాణం లేని వచ్చినట్లుండేది గిరిజ వస్తే. ఆ అమ్మాయి వెళ్ళగానే,

"అప్పుడే వెళ్ళిపోయిందా. ఇవేళ నాకు భోజనం ఉండదనుకున్నాను. ఈసారి నువ్వు మీయింటికి వెళ్ళినప్పుడు ఆ వాయిద్యాన్ని అక్కడ పడేసి రా," అనేవారు. వీణనుగురించి అంత నిర్లక్ష్యంగా మాట్లాడటం, నేను సహించలేకపోయేదాన్ని. భోజనం, నిద్రతో తృప్తిపడలేము కదా."

"మనం ఏపని చేసినా దానివెనక ఆత్మసంస్కారం కనిపించాలి. వాళ్ళ తాతగారు వేదాంతి అని, ఏవో గ్రంథాలు రాశారని చెప్పారుకదు నాన్నా! వీరిలో ఆ వాసనలేమీ కనుపించవు. భార్య అంటే జీవిత భాగస్వామిని అని ఆయనకి తోచదు. వేళకి తనకు పదుపాయాలు అమర్చే సేవకురాలు వారి దృష్టిలో. నాకు ఆశయాలు, భావాలు ఉంటాయనే తలంపు లేనేలేదు. ఈలోకంలో నేను కోరుకునేది చీరలు, నగలుమాత్రమేనని ఆయన అభిప్రాయం. అది నేను సహించలేను. నేను క్లబ్‌కి వెళ్ళటం ఆయనకి ఇష్టంలేదు. ఏలోటూ చేసేదాన్ని కాదు. వంట చేసి, మళ్ళీ భోజనం వేళకి వచ్చేసేదాన్ని. అయినా ఆయనకి అకారణంగా కోపం. కోపాలు వదిలి నామీద కసి తీర్చుకునేవారు. ఎక్కడికైనా వెళ్ళి వచ్చాక

"భోజనానికి రండి," అంటే

"నాకు ఆకలిలేదు. నువ్వు వెళ్ళి తిను," అనేవారు.

కోపం అందుకేనని తెలుసు కనక,

"తోచకపోతే వెళ్ళాను. మీ రూ సాయంత్రం స్నేహితులతో వెళ్ళారు. ఇంట్లో ఒక్కతెను తోచదని...."

"ఔను నాతో వంతు అన్న మాట. అయినా స్త్రీస్వాతంత్ర్యం. వద్దంటే మానతారా? నే నెందుకు వద్దంటాను?"

నవ్వరు కాని ఈ ప్రవర్తనతో వేధిస్తారు. ఎందుకు వెళ్ళానా అనిపిస్తుంది. ఇట్లా నన్ను ఏడిపించటం సరదాకి కాదు. కోపిష్టి స్వభావం, మనసులో నామీద ద్వేషం కాబోలు ననిపిస్తుంది. ఇంక భోజనానికి కూర్చున్నాక,

"కూర బాగా ఉడకలేదు. వ్యవధి లేక పోయింది కాబోలు. మజ్జిగ ఇట్లాగ తోడుకుంటేం? పాలు సమంగా కాచలేదా? ఇంటి పనులంటే శ్రద్ధ ఉండేకదూ. చదువుకున్న దానివి మరి."

ఆయన భోజనం చేసేదాక ముఖం చూపించేదాన్ని కాను. ఎందుకంటే, కళ్ళనిండా నీళ్ళు, గొంతుకు పూడి, మ్లానంగా ఉండేది. ఆయన వెళ్ళగానే గంటంతేసి వరండాలో కూర్చునేదాన్ని. ఆయనతో మాట్లాడాలనిపించేది కాదు. ఆ మనిషిలో మృదుత్వమన్నది ఏ కోశానా లేదా? ఏమిటీ జీవితం? అందరి సంసారాలు ఇట్లాగే ఉంటాయా? లేదు, ఎంతో సంతోషంగా ఉండేవాళ్లని చూస్తుంటాము. పోనీ వాళ్ళని చూసైనా అనిపించదా? మరి ఇది అజ్ఞానమా, నా అదృష్టమా?" అని ప్రశ్నించుకునేదాన్ని.

"లలితా!" అని ఆయన పిలిచేవారు.

ఎందుకో వెళ్ళి నేను కనుక్కోవాలి. చీకటిలో నా చెంపలమీద నీరు కారుతుం దేసిగా చూడటానికి వారురారు. వెళ్ళకపోతే నేను పొగరుకలదానిని. వెళ్ళి నేను గుమ్మంలో నుంచుంటే పక్కమీద పడుకుని "ఈ తమలపాకులు ఈనెలు తీసియిమ్మని నేను కోటా చెప్పాలా?" అంటారు. తమలపాకులు అందుకుంటూ

"ఏమిటట్లా దిగాలుపడి ఉన్నావ్. నిన్నేమన్నానని. నీ యిష్టంవచ్చిన చోటికి వెళ్ళు. వద్దనను. చీరకోసమేమిటి ప్లాన్? రేపు తెచ్చి పెడతాలే; ఇప్పుడు మాత్రం అలుక మానేసెయ్యి," అంటారు. నేను లొంగిపోక తప్పదు.

సర్వం అర్పించి, ఆనందం సృష్టించుదామనే దివ్యసంకల్పం నాదయితే, భార్య అనేదానికి మనసుందని, తనజీవితానికి విలువ యిస్తుందని, అతని ప్రవర్తననిబట్టి ఆమెకి సుఖదుఃఖాలు కలుగుతాయనే ఆలోచనే ఆయనకి లేదు. ఏమి చేయను నేను?" అని ప్రశ్నిస్తుంది లలిత.

ఔను, కన్న తల్లిదండ్రుల్ని వదిలి, పెరిగిన ఇల్లువదిలి, మనసులో ప్రేమ నింపుకుని ఆత్మార్పణం చేస్తుంటే అతను చూపవలసిన తీరు ఇదేనా?

అసలు ఆడపిల్లలు తాము పుట్టిపెరిగిన పరిస్థితులు వదిలి, అలవాట్లను ఎందుకు మార్చుకోవాలి? కొంతవరకు మగవాళ్ళు కూడా సర్దుకుపోవచ్చుగా. పూర్తిగా మారిపోవాలంటే, ఆ నూతనవధువుకి బాధ కలుగుతుందనైనా బావలాంటి మనుష్యులు గ్రహించలేరే. బావకి అమితమైన కోపంట! కథలో ఎక్కడైనా రాజకుమారిమీద రాజకుమారుడు కోపగిస్తాడూ? రాకుమారి నిద్రలేవటం ఆలస్యమయి సూర్యుని లేత కిరణాలు ఆమె వదనంమీద ప్రసరిస్తుంటే ఆ బంగారు వెలుగులో ఆపద్మ నయనాలు ఏవింత సొగసులతో వికసిస్తాయా అని ఎదురు చూస్తుంటాడు సౌందర్యపిపాసతో.

"ఇంత ఆలస్యంగా లేస్తే కాఫీ ఎప్పుడు చేస్తావ్? అంత మొద్దునిద్దరా?"

అని బావ తను లేవకుండానే మేల్కొలుపుతుంటే రాజకుమారిమనసు మొద్దుబారిపోదూ.

"పెళ్ళినాటికి మనసులో ఎంత అనురాగం ఆర్ద్రతా ఉన్నాయో, ఇక్కడికి వచ్చేటప్పటికి అంత వైరాగ్యం, విరక్తి నిండుకున్నాయి ఆ స్థానంలో. ఆయనకు నేనంటే కొంచెమైనా గౌరవంలేదు. అతని అనురాగానికి ముగ్ధురాలినవుతానని కాని, అతని నిర్లక్ష్యానికి దుఃఖమయి నేతానని కాని అతనికి ఏమీ తెలియదు. అటువంటి పాషాణ సముడి కాళ్ళదగ్గర పడేసి సుకుమారమైన నా జీవితకుసుమాన్ని ఎందుకు నలిపేయనివ్వాలి? అంతకంటె దేవుడిపూజ కర్పిస్తే పవిత్రత లేదూ! దేశానికర్పిస్తే సార్థకత లేదు!" అంటుంది లలిత.

అందుకే నాకు పెళ్ళిమీద నమ్మకంలేదు. కన్నెపిల్లలకు అది తీయటికల! కాని— ఎటువంటివాడైనా, కోరి చేసుకున్న పిల్ల అయినాసరే. భార్య అయేటప్పటికి అధికారభావంతో చూస్తాడు. బి. ఎ పూర్తి చేస్తాను. యమ్మే చదువుతాను. ఉద్యోగం చేస్తాను. స్త్రీసహజమైన వాంఛలు ఉండనీ, సబ్లిమేట్ చేస్తాను. సంగీతసాధన చేసి కళారాధనలో తపస్వినౌతాను. నా అందం, నాపాట, నా చదువు ప్రస్తుతం ఎవరైనా ఆరాధించవచ్చు. కాని ఆ వివాహమే జరిగితే ఆ బాధ్యతల్ని బట్టి అతను కూడా అందరిలాగే ప్రవర్తిస్తాడు. నాకల చెరిగిపోతుంది. ఈ జీవిత రాగాలాపనలో అది అపశ్రుతి అయితే నా బాధ వర్ణనాతీతం ఆరోజు సాయంత్రం. క్రిందటి సంవత్సరాదికి సత్య వచ్చింది.

"నేనూ సుధతోపాటు మళ్ళీ వీణ సాధన చేస్తున్నానే సత్యా! రాత్రి మేమిద్దరం వాయిస్తాము. నువ్వు పాడాలి," అంది లలిత.

ముగ్గురం కొత్తచీరలు కట్టుకున్నాం. తలలో మల్లెలు, నింగిలో నక్షత్రాలు, అమ్మ నాన్న, చెల్లాయి, తమ్ముళ్లు శ్రోతలు... వీణమీద సరిగమలు...సత్య కంఠంలో మధురిమలు. ఎంతో ఆనందం గాతింది. నాన్న "బంగారు తల్లులు" అన్నారు. పులకిస్తూ వీణ క్రింద పెట్టాను. సత్యరాణిని వొళ్ళోకి తీసుకుని ముద్దుపెట్టుకుంది. లలిత చరాలున లేచి లోపలికి వెళ్ళింది. వెనకే వెళ్ళాను. పక్కమీద పడుకుని ఏడుస్తోంది. ఏమనను? ఎవరు ఓదార్చగలరు? 1 కిటికీ దగ్గర నుంచున్నాను. ఒకప్రాణి దుఃఖం ప్రపంచమంతటా ప్రతిధ్వనిస్తుంది, అనిపించింది.

బావ వస్తున్నాడని రాశాడు. ఈ ఐదేళ్లు అతను జీవితం ఎట్లా గడిపాడో మాకు తెలియదు. లలిత బి. ఇడి అయి, ఏడాది నుంచి టీచర్ గా ఉద్యోగం చేస్తోంది. ఇన్ని ఏళ్లు కష్టపడి చదువు, సంగీతం సాధించి, బావ రమ్మంటే ఇప్పుడున్న స్వేచ్ఛ వదులుకుని ఆ వెనకటి జీవితంలోకే వెళ్ళిపోతుందా?

ఈ పాత కథలన్నీ అక్కయ్యకి కూడా గుర్తు వచ్చి ఉంటా" యనుకుంటూ లోపలికి వెళ్ళాను. సరిగ్గా ఆ ప్రశ్నే అమ్మ లలితని అడుగుతోంది.

"అతను రమ్మంటాడేమో! లేకపోతే ఎందుకు వస్తాడు" అని.

లలిత రాత్రివంటకి కూర తరుగుతోంది.

"రమ్మంటే వెడతానమ్మా" అంది దృఢంగా.

"బాగా ఆలోచించుకున్నావా?"

లలిత ముఖంలో ఆనందంలేదు. ఆలోచనగా, నిశ్చయించుకున్నట్లుగా "ఆ" అంది. ఎంతి గాంభీర్యం అనుకున్నాను.

"అంతేనమ్మా ఆడపిల్లల సంగతి. మరి ఇదంతా ఈచదువు, ఈ కష్టం..." అమ్మకి లలిత వెళ్లటం ఇష్టంలేదేమో ననుకున్నాను.

"రావలసిన మార్పు ఏదో నాలో వచ్చింది. ఆయన కూడా మారితే సంతోషం. కాకపోయినా నేను వెళ్ళక తప్పదు."

"బావ ఇదివరకులాగ సంకుచితంగా ఉంటే, నువ్వు ఉద్యోగం చేస్తున్నానని

# ★ అల్లుడి మంచితనం ★

నీమీద దురభిప్రాయంతో ఉంటే వెడతావా? మరి నువ్వు ఈ ఐదేళ్లలో సాధించింది ఏమిటి?" అన్నాను.

అక్కయ్య ఏ కాంతీ లేకుండా నవ్వుతూ, "జీవితాలకి అర్థం లేదే సుధా! ఏదో ఈ జీవితాన్ని కన్నీళ్లతోనో, మనసుకి గాయాలతోనో ఒకరిసేవ కింద గడిపిపోనీ," అంది.

యూనివర్సిటీ ప్రైజులు తెచ్చుకుంది. రేడియోలో పాడింది. నలుగురిచేత తెలివైందనిపించుకుంది. అటువంటి లలితే నా ఇంత జాలిగా మాట్లాడింది, అని నాకు కష్టంతోచింది ఇది ఆడవాళ్లలో బలహీనతా లేక, గొప్పతనమా?

ఐదు సంవత్సరాల తరవాత మాటలు, చూపులు లేకుండా కలుసుకోవటం.

బావ వచ్చాడు. నాన్నకి ఉండే ప్రశాంతతే ఇంట్లో అందరినీ ఆవరించింది.

లలిత అంత శాంతంగా ఉండటం చూసి నాకు ఆశ్చర్యం కలిగింది.

బావరాగానే నాన్న అడిగారు "కులాసాగా ఉన్నావా?" అని.

తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ, నుదుటిమీద పడే జుట్టును పైకితోస్తూ, "ఆ" అన్నాడు బావ.

లలితభావసంఘర్షణలేమీ తెలియకుండా, ఆకాశంలోకి చూస్తోంది దూర దూరంగా.

"లలిత స్కూలులో టీచర్‌గా పని చేస్తోంది" అన్నారు నాన్న.

"నాకు తెలుసు" అన్నాడు బావ.

నాకు అర్థమయింది, ఇక్కడి సంగతులన్నీ బావ తెలుసుకుంటూనే ఉన్నాడని. అమ్మ భోజనానికి లెమ్మంది.

"లలితని తీసుకు వెడదామని వచ్చానండి" అన్నాడు బావ. అమ్మ మాట్లాడలేదు.

"లలితకి రావటానికి అభ్యంతరం లేదోయ్ నువ్వే అడుగు," అన్నారు నాన్న.

అక్కయ్యకి ఆపుకున్నా కన్నీళ్లు వస్తున్నాయి. "ఆయన మనసు చాలా మెత్తనిదమ్మా. ఆ కోపం, సంకుచిత భావాలు మరుగున పడిపోయింది. దానిని చూశాను కాని, తీయలేకపోయాను. నన్ను క్షమించవచ్చా అనిపిస్తుంది" అంటోంది అమ్మతో.

"ఏమైతేనేయమ్మా! నీ కాపరం కుదుటపడింది. అంతకంటె నాకు ఏం కావాలి లలితా!" అంది అమ్మ.

ఆ మరునాడు లలిత చెప్పిన దానినిబట్టి అక్కయ్యకి, బావకి మధ్యన జరిగిన సంభాషణ ఈ విధంగా ఊహించుకుంటున్నాను.

అక్కయ్యను చూసి "రా, కూర్చో" అన్నాడుట బావ.

లలిత బావ పడుకున్న మంచం దగ్గర కుర్చీలో కూర్చున్నది.

"నీకు నాతో రావటానికి అభ్యంతరం ఉండదు కదు లలితా" అన్నాడు.

అక్కయ్య ఉండదన్నట్టు తల ఊపింది మౌనంగానే.

బావ ఇటువైపు తిరిగి పడుకుని లలిత ముఖంలోకి చూస్తూ.

"మరి ఈ ఐదేళ్లలో నీ సంగతులన్నీ నాకు తెలుస్తూనే ఉన్నాయి. నా సంగతులేమైనా నీకు తెలుసున్నాయా?" అనడిగాడు.

"క్రిందటి 'వింటర్'లో మీరు ఉత్తర దేశయాత్రకి వెళ్ళినట్లు ఎవరో చెప్పారు."

చప్పున లలిత పాణిని తన చేతిలోకి తీసుకుంటూ బావ,

"నేను ఎవరూ లేనివాడినికదా, నామీద కోపగించి వచ్చేస్తే నన్ను ఎవరు చూసుకుంటారనుకున్నావ్ లలితా! నీకు మీ అమ్మవాళ్లున్నారు. నాకెవరున్నారు?"

లలిత కళ్లలో నీరు నిండుకుంటోంది.

"అన్నయ్య దగ్గరకు వెళ్ళాను ఒకసారి. వదిన అడిగింది లలిత ఎప్పుడు వస్తుందని. 'ఏమో నాకు తెలియదు. ఇంక రాదేమో' అన్నాను. 'ఎందుకు రాదూ! ఏమిటా పరిహాసం' అంది వదిన. అందరికీ అది పరిహాసమయితే నాలో అది పరివర్తన.

నీకు గుర్తుందా లలితా నువ్వు వచ్చే ముందర ఏం జరిగిందో?"

అక్కయ్య మాట్లాడకుండా వింటోంది.

మీ నాన్న మన ఇద్దరినీ పండగకి రమ్మని రాశారు.

'మీ నాన్న క్రిందటిసారి కూడా ఏమీ ఇవ్వలేదు. ఈసారి వాచీ ఇమ్మను. వస్తాను' అన్నాను.

'ఇవ్వకపోతే రారా?' అన్నావు. 'ఊహు' అన్నాను నవ్వుతూ.

"పండగకి రావటానికి మీకు లంచం కావాలన్నమాట" అన్నావు పండగకి ఇంటికి వెడతామని సంతోషంగా ఉన్న నీ ముఖంలో క్రోధఛాయలు ఆవరించుకున్నాయి.

"ఔను" అన్నాను ధీమాగా.

"ఊహు మా నాన్న ఇవ్వరు. నేను ఇమ్మని చెప్పను. మా మనసుల్లోంచి మీకు పిలుపు వినబడితే సరేసరి. పండగకి మాకు తోచినది ఇస్తాము" అన్నావు.

నీ చేత ఎంతో అవమానం కలిగినట్లు క్రోధావేశం కలిగింది నాకు, బతిమాలేవాళ్లను ధిక్కరించావని. రైలులో ఎక్కేదాక నువ్వు మాట్లాడలేదు. మీ నాన్న వచ్చారు, తీసుకు వెళ్ళటానికి. సెలవ దొరకదన్నాను. ఆఖరుగా నువ్వు అన్న మాటలు నాకు గుర్తున్నాయి.

"నాకేమిటో అసంతృప్తిగా వుంది. కొన్నాళ్ళు మా అమ్మదగ్గర ఉంటాను. మీలోనో, నాలోనో మార్పు రావాలి. అప్పటికి మీరు నా బాధని అర్థం చేసుకుంటే నేను కోరుకునేది మళ్ళీ మీదగ్గరకు రావాలనే."

"నీకు కళ్ళల్లో నీళ్ళెందుకు వస్తున్నాయి లలితా" అన్నాడు బావ. లలిత మాట్లాడలేదు. కంఠం మాట్లాడనివ్వటలేదని బావకికూడా తెలుసు. అక్కయ్య చేయి బావచేతిలో వుంది. లలిత కన్నీళ్ళు తుడుచుకుంది.

"ఇప్పుడు నాతో రావడానికి నీకు అభ్యంతరం ఎందుకు లేదు?" ప్రశ్నించాడు బావ.

"నేను మారాను. మీరు ఎట్లాగున్నా నా ధర్మం నేను ఆచరిస్తాను. ఇంతకాలం గడిచింది కాని, జీవితానికి అంతకంటె అర్థం గోచరించలేదు నాకు," అంది లలిత.

బావ సన్నగా నవ్వుతూ,

"లేదు లలితా, నేను ఒప్పుకోను. నువ్వు చేసే ఈ త్యాగాన్ని నేను భరించలేను. నేను మారాలని చెప్పివచ్చావు. నేను మారినట్లు కనిపిస్తేనే రా. నీ ధర్మం విధిగా నిర్వహిస్తానంటే, అంతకంటె నువ్వు ఇక్కడే ఉండిపోవటం మంచిదంటాను," అన్నాడు.

అక్కయ్య నవ్వింది.

"మీరు మారారు. మీరు ఇక్కడికి వస్తా

---

### చెప్పు దెబ్బ

ఒకప్పుడు సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు బందరులో క్లాసుపిల్లల కాంపోజిషన్ పుస్తకాల కట్ట పట్టుకెళుతున్నారట. ఆయన బహుచమత్కారి. ఆ దారినే వస్తున్న ఆయన శిష్యుడొకడు 'మేష్టారూ గాడిద బరువు మోసుకొస్తున్నారు పాపం' అని వ్యంగ్యంగా సానుభూతి వెలువరించాడట.

అంతట వెంటనే నాయుడుగారు 'పిచ్చినాయనా ఇది ఒక గాడిదబరువు కాదురా, నలభై గాడిదల బరువు' అని బదులు చెప్పారట. గుండెలో రాయిపడ్డ శిష్యుడు తలవంచుకు చక్కాపోయాడు.

---

కని రాసినప్పుడే అసంగతి నేను తెలుసుకున్నాను. అయినా మీతో రావటానికి సిద్ధంగా ఉన్నాను. ఈ ఐదేళ్ళలో సంగీత సాధన చేశాను. ఎక్స్‌కర్షనకి యాత్రలకి వెళ్ళాను. సోషల్ సర్వీస్ క్యాంప్స్‌లో ఉన్నాను. ఎన్ని పరదాలున్నా జీవితాన్ని గురించిన జిజ్ఞాస తీరలేదు. తృప్తి లేదు. జీవితానికి అర్థం లేదు అనే భావం వేధించేది. అటువంటప్పుడు జీవితానికి ఒక ప్రయోజనం కల్పిస్తే, ఎవరి భార్యగా గుర్తించబడానో వాళ్ళదగ్గరే నాజీవితం గడిచిపోతే అనేక తృప్తిగా ఉంటుందికదూ."

'అంతవైరాగ్యమా. కాని నువ్వింత స్వార్థరహితంగా నాకు సేవచేస్తానంటే నేను స్వీకరించలేను లలితా. నువ్వు ఇదివరకు నాలో ఏవ్యక్తిత్వం కోరుకున్నావో దానిని ఏమైనా నువ్వు చూసగలిగి నీమనసు ఆనంద ప్రపూర్ణమైతేనే నాతోరా..." అన్నాడు బావ.

లలిత లేచి బావ తలవైపు కూర్చుంది. ఒక ఆనందాతిశయాన్ని అనుభవిస్తూ.

"మీరు ఇంత సున్నితంగా మాట్లాడటం ఎక్కడ నేర్చుకున్నారు? ఈ ఐదేళ్ళు ఎట్లా గడిపారో నాకు చెప్పరూ?" అంది.

'చెప్పకపోతే ఈ ఐదుసంవత్సరాలమధ్య దూరాన్ని సన్నిహితం చెయ్యట మెట్లాగ చెప్పు. కథ ఏమిలేదు లలితా! నువ్వెళ్ళాక నాకు తోచేదికాదు. నిన్ను గురించి ఆలోచిస్తుండేవాడిని. నీకు తెలియదు లలితా! నాకు మొదటినుంచి నీ మీద చెప్పలేనంత మమకారం ఉంది. కాని అది వెలడిఅయ్యే అవకాశం నేనివ్వలేదు. మాఅమ్మ నాకు గుర్తుంది. మా వదినను చూస్తున్నాను. అన్నయ్య వదినని అట్లాగే చూస్తాడు: వదిన ఏమీ పట్టించుకోదు. నవ్వుతూ నేఉంటుంది. మా అమ్మకి వంట సంసారం తప్పితే ఇంకొక తాపత్రం ఉండేదికాదు. ఆడవాళ్ళను గురించి నాకంతకంటె అభిప్రాయాలు లేవు. నీవు ఎంతో బాధపడావుకదూ.

నువ్వు వెళ్ళిపోతే నాకెందుకు అంత తోచకపోవటం? మళ్ళీ నువ్వు రావనుకుంటే బాధతోచటం. నువ్వు ఇంటర్ పరీక్షలకి వెళ్ళావని విన్నప్పుడు చాలాకోపం వచ్చింది. ఇక మన సంబంధం విడిపోయినట్లే అనుకున్నాను. కాని ఆలోచనలు నిన్ను వదిలి వచ్చేవికావు. నీవు వెళ్ళిపోవటానికి తగిన కారణం కనిపించేదికాదు. నీ వస్తువులు చూస్తుండేవాడిని. తోచక పుస్తకాలు చదవటం మొదలుపెట్టాను.

చదివినకొద్దీ ఏదో కొత్తప్రపంచంలోకి వెళ్ళినట్లు కుతూహలం ఎక్కువయింది. రెండుసంవత్సరాలు పుస్తకం విడవకుండా కనిపించిన ప్రతిపుస్తకం చదివాను. మనుష్యుల్లో కలిసి తిరగటం లేదని అప్పుడందరూ చెప్పుకునేవారు, నువ్వు వెళ్ళిపోయ్యావని, నాకు విరక్తికలిగిందని. నీమీద అభిప్రాయాలలో మార్పు ఎప్పుడు వచ్చిందో, ఎట్లాగ వచ్చిందో తెలియదుకాని, నువ్వు బి. ఎ. పాసయ్యావని విన్నప్పుడు నాకు సంతోషమే కలిగింది. జ్ఞాన ఉన్నతిని కోరుకోవటం, ఆనందాన్ని వెతుక్కోవటం మనిషిలో ఉత్కృష్టమైన గుణాలు. నీలో ఉన్న విశిష్టతను నేను గుర్తించలేకపోయాను. అది ఒక అంధకారం.

నీవు వెళ్ళిపోయాక కలిగినలోటు తెలిసినప్పుడు నీవు నాకెంత ముఖ్యమైనదానివో అర్థమయింది. అటువంటి నీమీద నేను తీసుకున్న శ్రద్ధ, చూపించిన ప్రేమ తలుచుకుంటే నాకు సిగ్గువేసేది. చాలాబాధగా ఉండేది. మళ్ళీ మనం కలుసుకోగలమాఅని ఆలోచించేవాడిని. నీవు చాలా మెత్తనిదానివని నాకు తెలుసు. ఒక ఏడాదినుంచి రావాలని, నిన్ను తీసుకువెళ్ళడానికి...కాని జాతకప్రకారం ఈకాలం అనుకూలంగా ఉంది."

"జాతకాలుకూడా నేర్చుకున్నారా?"

"ఊ, లిటరేచర్, ఫిలాసఫీ, ఎస్ట్రాలజీ అన్నీను. ఏం భయంవేస్తోందా?' అన్నాడు బావ నవ్వుతూ.

లలితకూడా నవ్వుతూ "మీరు మళ్ళీ పెళ్ళి చేసుకుంటారని విన్నాను" అంది.

"విన్నావేమోకాని, ఎంత సంస్కారం లేకపోయినా అంతహీనమైన బుద్ధి పుట్టలేదు నాకు. నీమీదతప్ప నాకు వేరే ఆలోచనలు లేవు లలితా" అన్నాడు బావ.

లలిత అప్పుడు గంభీరంగా 'ఆమాటకివస్తే మీఅంత ఉదారమైనదానిని కాదు నేను. మీకంటె నాకేదో వ్యక్తిత్వం, సంస్కారం ఉన్నాయని, మీకంటె ఎక్కువదాన్ని అనే అతిశయంకూడా ఉండేదినాకు. అదంతా అజ్ఞానంకదాఅని నాకు చింతకలుగుతోంది.'

'అజ్ఞానం కాదు లలితా! స్త్రీ యెప్పుడూ తనభర్త అన్నింటిలో తనకంటె అధికుడు కావాలని కోరుకుంటుంది," అన్నాడుబావ.

బావ గుండెమీదపడే జుట్టును వేళ్ళతో సర్దుతూ అంది లలిత:

"నన్ను క్షమించావనండి."

"ఎందుకూ" అన్నాడు బావ.

"ఏమో నాకు తెలియదు" అంది లలిత.

"ఇప్పుడు నాఅంత అదృష్టవంతురాలు లేదనిపిస్తుంది. ఇంతవరకూ నాజీవితం సుఖాంతం అవుతుందనే ఆశ నాకుండేది కాదు. ఇట్లాగ విడిపోయినవాళ్ళంతా తిరిగి కలుసుకుంటున్నారా అమ్మా?" అంది లలితక్కయ్య.

ఆరోజు బావతో అక్కయ్య వెళ్ళిపోతోంది: చాలామంది చూడడానికి వచ్చారు. అక్కయ్యకి చీర, పసుపు, కుంకుమ ఇస్తుంటే అమ్మకి కళ్ళలో నీరు తిరిగింది పక్కింటి పిన్నిగారు,

"మళ్ళీ ఇన్నాళ్ళకి అమ్మాయి తనఇంటికి వెడుతోందమ్మా. సంతోషించవలసిన సమయమిది. అంతా అమ్మాయి అదృష్టం, అల్లుడి మంచితనమూనూ" అంది.

సంతోషించవలసిన సమయమైనా అందరి హృదయాలు బరువుగా వున్నాయి.

"మళ్ళీ సుధ కల్యాణంబొట్టుతో నిన్ను చూడడానికి నీ పెళ్ళికి వస్తానే సుధా!" అంది అక్కయ్య.

"అంతవరకూ రాకుండా ఉండగలవా అక్కయ్యా! కొన్నివిశ్చుపడుతుందేమో!" అన్నాను.

"ఏం, రిసెర్చిచేస్తావా, ఫారిన్ వెడతావా?' అన్నాడు బావ.

"అది కోరినవాడు దొరకవద్దూ" అన్నారు నాన్న నవ్వుతూ.

"నువ్వుకూడా మీ అక్కయ్యలాగ షెల్‌లెస్ బ్రెయిన్‌ని చేసుకో. నీకు కావలసినలాగ దిద్దుకుందువుగాని" అన్నాడు బావ.

"బ్రెయిన్‌అంటే మట్టిముద్దకాదు కదా బావా! అయినా మాఅక్కయ్య నిన్నేమీ దిద్దలేదు. నీఅంతట నీవే అప్రతిభుడవైపోయావు" అన్నాను.

"ఇది యదార్థలోకమమ్మా సుధా! నీవు కలలుకనే మనిషి ఈలోకంలో లేకపోతే" అన్నాడు బావ.

"రాజకుమారుడు రాకపోతే, ఋషికన్యలాగ ఉండిపోతాను బావా! అన్నాను.

"రాజకుమారుణ్ణి నేను వెదికి తెస్తాను" అన్నాడు బావ బండి యెక్కుతూ.

అందరిముఖాలు హాసప్రఫుల్లాలయ్యాయి.

"అక్కయ్యకి రాజకుమారుడు దొరికాడు" అనుకున్నాను నేను. 

ఒకానొకనగరంలో ఒక మతప్రవక్త ప్రసంగిస్తుండగా అంతా నిద్రపోయారు ఒక్క పల్లెటూరివాడుతప్ప. అంతట అతడు అందరినీ సంబోధించి "మీరంతా విశ్వాసహీనులు. చూడండి ఆమూల ఒక్కగానొక్క పామరుడు తప్ప నే చెప్పేది ఎవరికైనా పట్టిందేమో!" అన్నాడు విచారంగా.

వెంటనే ఆ పల్లెటూరు వ్యక్తి "నేను పామరుణ్ణిగనకే యింకా వింటున్నాను. లేకపోతే యెప్పుడో నేనూ నిద్రపోయేవాణ్ణి స్వామీ" అన్నాడు సవినయంగా.




# కార్టూన్ లు

లేక

## వినబడని పాట

### సినీ మాయామానవ గోళరాగము

హీరో: నీలా! నీలాంటి భార్యను పొందటం...నీ:......
హీ: పొందడం
నీ: ...
హీ: పొందడం...
నీ: ఏ... చాలు ఇహ జరక్కండి. పెన్నారు వ్నారు జాగ్రత్త.

డైరెక్టరు: ఎవరు మీరు? ఈతొళ్లూ తిప్పట్లూ కత్తులూ కటార్లూ ఏమిటివన్నీ?
వారు: చిత్రం. మమ్మల్ని లాస్టుసీను యాక్టర్లంటారండి. కథని అపుడే ముగ్గించానికి పనికొస్తాం. ఇక్కడ మీ కథ ఆగట్లేదని, ప్రొడ్యూసరు గారు పంపించారు. మేం కాసేపు కొట్టుకుంటే కథ అయిపొద్ది. మమ్మల్నెరగనంటారేం?

ఒక ప్రేక్షకుడు: ఛీ. ఈ పాటే ఏంటి మధ్యన యుగళపాట యుగళపాటాని గందోళి గోల్లాగ.

పక్కతను: నీకు తెల్దది బాక్సాఫీసు పాటంటార్లే మాసప్పీలుకని ఇటాంటి యుత్తాల్లే యుయ్యా నేపోతే డబ్బెట్టే వాడు ఒప్పుకోడంట. అళ్ళకో ఎవని—

ప్రొడ్యూసర్: (ఆఫీసులో కిరాగా చేవల్ల చూసి చేరే మని భయపడినట్లరచి మూర్ఛపోయి మళ్ళీ వచ్చును) ఏమిటిదీ జబ్బు చేసిన వానపాములా?

జ॥ చే॥ వా॥ పా॥: నేను పదేండ్ల క్రితం జూబిలీలు చేసుకున్న పిక్చర్లలో బాక్సాఫీసు అయిడియా వండి, వాడి వాడి ఇలా వాడిపోయాను. కొత్తల్లో కొండచిలువలా వుండేవాణ్ణంట.

ప్రేక్షకుడు 1: ఆ యాక్టరంత గట్టిగా అరుస్తాడేం? మనకేమన్నా చెముడనుకున్నాడా?

ప్రే 2: మనక్కాదు. వారికే ఉండనోపు.

ప్రే 3: వుండవయ్యా అసలే వెనకాల బ్యాగ్రౌండు మ్యూజిక్‌తో మాట వినబడక చస్తుంటే మళ్ళీ మీ సొదొకటా?

"హీరో వుట్టిచవటలా వున్నాడే... విలను గాడు అంత లేని కళ్ళుచేసి మొహంనిండా గుర్రాక్కడిరంగుపూసుని ఒక్కలా నటించిపారేస్తున్నా వాడు సన్మార్గుడు కాడని ఎవడు పసిగట్టడేం చెప్మా!"

వార్త: క్రిందటి నెలలో ఎక్సెఫిలింస్ వారి చెస్టుపిక్చరుగాను, మీ ప్రొడక్షన్స్ వారి 'మా' చిత్రంగానూ, వై ఫిలింస్ వారి 'డోంట్ నో'కు తెలుగు వరసు జానపదం గానూ నటించిన సుప్రసిద్ధమైన శ్రీ తెలుగు సినిమా కథ, ఈసారి ఫలానా ఫిలింస్ వారి పౌరాణికం గా అవతరించబోతున్నది. ఇందులో ఇంద్రుడు శ్రీ –రావుగాను, శచీదేవి శ్రీమతి —ఠిలేకఫోర్ గానూ, వుభరణా శ్రీ— గానూ, జలాలుద్దీన్ శ్రీ-గానూ శ్రీ యుతులు..., ..., శ్రీమతులు..., ....., ప్రభృతులు గెస్టార్టిస్టులు గానూ, శ్రీయుతులు ... ..,....,...శ్రీమతులు...,..ఉత్తారిస్టులుగానూ, భరతనాట్యం రాకం డ్రోలుగానూ సౌపదాలు తెలుహిట్ పాంపులుగానూ, కృతి జానపదగేయం గానూ, ప్రకృతిస్టుడియో సెట్ గానూ, అస్వా మనస్వాం గానూ హాంగామా గామా గానూ, అంతా కలిసి దర్శకుడు గానూ, ఈ అందరూ కలిసి రచయిత గానూ ఇటీవలి హిట్ చిత్రాలలో కథామాటలూ మీటలూ పాటలూ బాటలూ పాత్రలూ మాడలూ సరికొత ...,...,లు గానూ (వరుసప్రకారం)నటించగలవని తెలుస్తున్నది. అంతపనీ చేసి ఊర్కుంటారనిందికేం సందేహం లేదు.

"...స్పుట్నిక్‌జ్ కథండీ మరీ అన్ని ఇట్టే మారిపోతాయి. ఇహనుంచి, మరేమో ఇనవై అయిదు వారాలకీ ఉత్సవాలంటవుడ. 2 రోజులకే చేసేసుకుంటారు. అలాగే హాండ్రెడేసులుండవు హాండ్రెడనర్సు. కావాలే వందగంటలూ, మరిన్ని వంద నిముషాలూను ...మనం చంద్రగోళం చకచకా ఖళ్ళిపిచ్చేసం బాహా సుళువయిపోయినాటకి పిచ్చేసు హాండ్రెడ సెకండ్స్ నూరు సెకను నిల్చి ఆడినందుకు ఉత్సవాలు చేసుకుంటూ ఉంటాయి. స్పుత్నిక్ యుగంగదా మరీ... స్పీడు పెరిగిపోతోంది. ఆలోచించేముందడం లేదు. బిజీ బిజీ గజిబిజీ."

—సి. జి. నాయుడు



శ్రీరామా ఫిలింస్ వారి 'భక్త అంబరీష'లో శ్రీరంజని జూనియర్.



శ్రీ వెంకటరమణా వారి 'బాలనాగమ్మ' చిత్రంలో రేలంగి, అంజలీదేవి,

నందీ పిక్చర్స్‌వారు 'నాగార్జున' అనే చిత్రం నిర్మిస్తున్నారు. ఇందులో రాజకుమార్ అనే కొత్త నటుడిని పరిచయం చేస్తున్నారు. జి. వరలక్ష్మి, సంధ్య, రమాదేవి, నాగయ్య, రమణారెడ్డి, కాంతారావు, రఘురామయ్య, మిక్కిలినేని, మాస్టర్ సత్యనారాయణ పాల్గొంటున్నారు. మాటలు తాండ్ర సుబ్రహ్మణ్యం, పాటలు ఆరుద్ర వ్రాస్తున్నారు. సంగీతం రాజన్, నాగేంద్ర. దర్శకుడు వై. వి. రావు.

## కాళిదాసు

శారణీ ప్రొడక్షన్స్ పేరిట నాయుడు నిర్మిస్తున్న 'కాళిదాసు' చిత్రం తొమ్మిది రీళ్లు (ఎడిట్ చేసినది) పూర్తి అయింది. పింగళి నాగేంద్రరావుగారు రచయితగా, కమలాకర కామేశ్వరరావు దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో కాళిదాసుగా నాగేశ్వరరావు, విద్యాధరిగా శ్రీరంజని జూనియర్ ఆమె తండ్రిగా లింగమూర్తి, భోజుడుగా రేలంగి, కె. వి. ఎస్. శర్మ, బొడ్డపాటి కృష్ణారావు మొదలగువారు పాల్గొంటున్నారు.

కాళిదాసు వెర్రిగొల్లడుగా పెరిగి తిరిగిన రోజులలోనే అతని మాటలలో, చేతలలో, కాగల మహాకవి ద్యోతకం అయిందన్న ఊహను సున్నితంగా స్ఫురింపచేస్తూ అతని పూర్వాపరాలను, అతని జీవితాన్నీ, కావ్యాలనూ మనోహరంగా సమన్వయిస్తూ రచయిత నాగేంద్రరావుగారు కథాసంవిధానాన్ని నిర్వరచారనీ, మాటమాటనూ తూచి తూచి పొందుపరచారనీ అయిన మేరకు చిత్రం చూచినవారు అంటున్నారు. తీసిన వాటిలో కాళిదాసు ప్రత్యక్షరామాయణం ఆడడం, రాజదర్బారులో మహాకవిగా వెలుబడే కాళిదాసు వంటి ఘట్టాలు రమణీయంగా ఉన్నాయంటున్నారు. ఈ చిత్రానికి పెండ్యాల సంగీతం సమకూర్చుతున్నారు. కళాదర్శకుడు గోఖలే. దర్శకత్వం కె. కామేశ్వరరావు నిర్వహిస్తున్నారు.

వెంకటరమణా ఫిలింస్ వారి జానపద

అవుతోంది. విశేష వ్యయ (7 లక్షలు) ప్రయాస (మూడేళ్లు) లతో అగ్రశ్రేణి తారాగణంతో నిర్మించిన ఈ చిత్రంలో కథ అందరికీ తెలిసినదే, అభిమాన పాత్రమైనది. లోగడ ఒకసారి డా॥ గోవిందరాజుల సుబ్బారావు, కాంచనమాల, పువ్వుల పద్మ(?) తులతో చలన చిత్రంగా వచ్చి ఘనవిజయం సాధించింది. దాంతోపాటే మరో నటబృందంతో మరో చిత్రం కూడా వచ్చిందికాని వీగిపోయింది. సంగీత దర్శకుడు సాలూరు రాజేశ్వరరావు ఈ రెండవదానిలో వేషం వేసి, మొదటిదానికి సంగీతం సమకూర్చారు కూడా.

మొత్తానికి ఈ విధంగా అందరికీ అభిమాన పాత్రమైన చిత్రంమీద, కొన్నాళ్లకి మరో చిత్రం తీసేటప్పుడు అందులో పాల్గొనే వారంతా విశేషించి శ్రద్ధాసక్తులతో పని చేస్తారు-అనిపించుకోవాలని. కొత్త బాలనాగమ్మ చిత్రంలో బృందంకూడా చాలా కృషిచేశారు. ఇందులో బాలనాగమ్మ అంజలీదేవి, కార్యవర్ధిరాజు ఎన్. టి. రామారావు, బాలవర్ధిరాజు మాస్టర్ సత్యనారాయణ, మాయల ఫకీరు రంగారావు, గాంధర్వంగు రాజసులోచన. దర్శకుడు వేదాంతం రాఘవయ్య. రచయిత సముద్రాలజూనియర్. సంగీత దర్శకుడు టి. వి. రాజు.

# • చిత్రసమీక్ష • •

## నవరంగ్, హెర్క్యులీస్, విట్నెస్..



'నమ్మినబంటు'లో కూట పన్నుతున్న రేలంగి.

శాంతారాం తన కొత్త చిత్రం 'నవ్‌రంగ్'లో నిర్మించిన ఊహాసౌధాలను ఆసాంతం చూచి ఆనందించాలంటే, ఆ చిత్రం రెండుసార్లు చూడాలి. ఇంకో కారణంకూడా ఉంది. శాంతారాం పేరు చెబుతూ, ఆయన శిల్పం చెబుతూ అల్లుకున్న అభిప్రాయాలను, దురభిప్రాయాలను, అపోహలను పూర్తిగా చెరిపేసుకోవాలి.

దాదాపు అన్నివిధాలా 'నవ్‌రంగ్' అసాధారణమైన చిత్రం. ఇంత వింతను తలపెట్టి సాగించటం శాంతారాం ఒక్కడికే చెల్లుతుంది; చెల్లింది. కథ అసాధారణమైనది. సాదాగా, మరీ సంసారపక్షంగా ఉండే ఇల్లాలును చూస్తూ కవిత్వం చెప్పలేక, ఆమె ప్రతిపదికగా ఒక ఊహాసుందరిని సృష్టించుకుని, ఆమె ఆసరాగా కవిత్వం అల్లుకుపోతూ ఉంటాడు. చిత్రంలో ప్రధానమైన నృత్యాలుకూడా అపురూపమైనవే. ఇందులో సంధ్య చేసిన ముక్తనృత్యం ఇంతవరకు సినిమాలో ఎవరూ చూపలేదు. రూపకల్పన చిత్రణ విశిష్టంగా విలక్షణంగా ఉన్నాయి. సంగీతం స్వరూపస్వభావాలుకూడా దీనికి తగిన మాస్టరులోనే రామ్‌చంద్ర నిర్వర్తించారు. ఇది ఏమాత్రం సినీసంప్రదాయానికి లోబడదు. నిజానికిదే ఓ కొత్త సంప్రదాయాన్ని సృష్టించి, అతిలోకసుందరంగా భాసించింది. మొత్తంమీద పదేళ్ళతరవాత రాతగ్గ చిత్రం నవరంగ్.

అసాధారణ చిత్రం అన్నంతమాత్రాన ఇది అసాధారణమైన ప్రశంసలూ, లాభాలూ గడిస్తుందనీ, భ్రాంతిదేశంయావత్తూ సకుటుంబంగా ఈచిత్రం విరగబడి చూస్తుందనీ అనుకోనవసరం లేదు. ఐతే కావచ్చు,

ఎందుకంటే, ఏది వారికి అసాధారణంగా ఉన్నప్పుడు, ఇటు మేధావులు ఇదేమిటి వెర్రిఅన్నట్టు కోపంగా చూస్తారు; సామాన్యులు ఏదోగోలలే అని ఊరుకుంటారు. నవరంగ్ విషయంలో లాబీవిమర్శకులు కొందరు ఈమాటే అన్నారు: శాంతారాం బోల్తాకొట్టాడు. తప్పులో కాలేశాడు. సినిమా శిల్పంమీద ఆయనపట్టు సడలింది అనీ. కాని ఇది శుద్ధపొరపాటు. శాంతారాం బోల్తాకొట్టలేదు. చిత్రనిర్మాణంలో పట్టు సడలనూ లేదు. తను నిర్ణయించుకున్న పద్ధతిలో ధాటిగా చెయ్యదలచుకున్న పని చేశాడు. ఎటొచ్చి ప్రేక్షకులు చాలామందికి అర్థంకాకపోవచ్చు. కంగారు పెట్టవచ్చు. కొందరికి అయోమయంగా తోచవచ్చు. కారణం ఇది నిజంగా 'హైస్థాయి' చిత్రం.

రెండోవిషయం: శాంతారాం చిత్రాల మూగ్గుల నటనావైభవం చూసి నేను ఎన్నడూ ముగ్ధుణ్ణి కాలేదు. అందువల్ల ఆయన పాతచిత్రాలలోలాగే ఇందులోను నటన నాకు ఏమంత అద్భుతంగా మనోహరంగా కనిపించలేదు. సంధ్య, ఝనక్ ఝనక్ చిత్రంలో చేసినట్టే చురుగ్గా, కత్తిలా కరుగ్గా, తిరుగుతూ నర్తిస్తూ, కీచురాయిని వెక్కిరిస్తున్నట్టు అరుస్తూ మొత్తంమీద ఎబ్బెట్టుగా కనబడింది. చిరాకుకూడా కలిగించింది.

ఇందులో హీరో ఉన్నంత నేలబారుగా మెతకగా ఎవరూ ఉండరు. ఉంటే మొగా కనిపించుకోడు, శాంతారాం, హీరో మహీపాల్ ని ఇలాగే తయారుచేశారు.

వందన విషయమూ అంతే. చూస్తూ చూస్తూ ఇలాటి అమ్మాయిని దివ్యసఖిగా ఊహించుకోనూ లేము; ఎవరైనా ఊహించి పెట్టినా హరాయించుకోనూ లేము. ఈవిధంగా ముఖ్యనటులు ముగ్గురూ మనని సమ్మోహితుల్ని చేయలేకపోయినా, మిగతా వారు కేశవరావ్ దాతే, బాబురావు పెండార్కర్, ఉల్హాస్ ప్రశంసనీయంగా నటించి చిత్రానికి కీర్తిని ఏమకూర్చారు.

మాట వరసలు (భరత్ వ్యాస్) నేలబారుగా ఉన్నా, పాట వరసలు (రామచంద్ర) తారస్థాయిలో నిలచాయి. భారతీయ చలనచిత్ర సంగీతరచయిత లెవరూ అందుకోని శిఖరాలను ఈయన అందుకొన్నారు. వీటిలో పాటలు అన్నీ బాక్సాఫీస్ హిట్ లు అవి కాకమంతా మారుమోగకపోవచ్చుగాని మంచి అభిరుచిగలవారందరికీ చాలా బాగున్నాయనిపిస్తాయి. ఒక చవకబారు వరసగాని, చవటబారు పోకడగాని లేదు.

కొన్ని మంచిపనులు చేయడం ఒక్క శాంతారాంకే ఎలా చెల్లుతుందో, కొన్ని



'విట్నెస్' చిత్రంలో ముద్దాయి టైరోన్‌పవర్, సాక్షి మెర్లిన్ డీట్రిక్. లాయరు లాటన్.

చెయ్యకపోవడమూ అలాగే చెల్లుతుంది.

ఇంకోళ్ళయితే ఈ చిత్రాన్ని రంగులలో తీసినందుకు పుష్కలంగా కొంకపోయినా కొంతవరకైనా ప్రకృతి దృశ్యాలమీద రెండు పాటలూ ఒక నృత్యం చిత్రించేవారు. శాంతారాం అలాటి 'పిచ్చి' పనులు చెయ్యలేదు. ఏదిచేసినా, మానినా నవరంగ్ తప్పకుండా చూడవలసిన చిత్రం. చాలా అసాధారణమైన చిత్రం. —టచ్‌స్టోన్



# విట్నెస్ ఫర్ ది ప్రాసిక్యూషన్

అపరాధ పరిశోధక సారస్వత ప్రపంచంలో చక్రవర్తిని అనిపించుకున్న అగాథా క్రిస్టీ కథ, నాటకం ఆధారంగా దర్శకుడు బిల్లీ (లవ్ ఇన్ ది ఆఫ్టర్ నూన్) వైల్డర్ తీసిన 'విట్నెస్ ఫర్ ది ప్రాసిక్యూషన్' హాలీవుడ్ నుండి అరుదుగా వచ్చే మంచిచిత్రాల కోవలోనిది.

ఉత్కంఠను అతిసమర్థంగా పోషించుకువచ్చి, పాఠకుడిని చివరి మెలిక తాయిళంలా అవ్యూహానుమించిన మెలికతో పడగొట్టడం ఊహించనిచ్చిన రచయిత్రి క్రిస్టీ పద్ధతి.

ఈకథలో ఆశిల్పం అద్భుతంగా ప్రయోగించింది. లియోనార్డ్ వోల్ అనే యువకుడిని మిసెస్ ఫ్రెంచ్ అనే వడివయసు ధనికురాలు చేరదీసి ఆదరిస్తుంది. ఆమె ఆస్తినంతా ఇతనిపేర వ్రాసిన వారంలోగా ఆమెను ఎవరో ఖూనీచేస్తారు. దోషి ఇతనేనని బలమైన సాక్ష్యం దొరుకుతుంది. అన్నిటికన్న బలమైన ఎదురుసాక్ష్యం అతనిభార్యది. సర్ విల్ ఫ్రిడ్ రాబర్ట్స్ అనే బారిస్టరు ఈ కేసులో అతన్ని పనికేసుకొచ్చి వాదిస్తాడు. ముద్దాయి దోషి అవునో కాదో తేలడం ఒక ఎత్తుఅయితే, ఆతరువాతి ముక్తాయింపు ఇంకో ఎత్తు. మీరు ఊహించని సంఘటన, మిమ్మల్ని సంభ్రమచకితులను చేసివేస్తుంది. ఈలోగా దారిపొడుగునా చూస్తున్న దానిని చూసి ఆనందిస్తూ ముసలిబారిస్టరు మందులకోసం చేసే గారాలు, కోర్టులో ప్రాసిక్యూషన్ లాయరుమీద వేసే విసుర్లూ ఛలోక్తులూ విని సంతోషిస్తూ ఎప్పటికప్పుడు తరవాత ఏమవుతుందని ఊహిస్తూ ఉత్సాహంగా కూర్చుంటారు. అంతకన్న కావలసిందేమిటి? ఇంత పకడ్బందీగా చెప్పుకొచ్చిన కథలో నటించే జనాభా సవ్యంగా ఉండే, కథ పట్టుపాడుచెయ్యకుండా ఉండడం. బారిస్టరుగా చార్లెస్‌లాటన్ నటించాడని చెబితే ఇలాటి సందేహాలు పూర్తిగా పోతాయి.

ప్రపంచం మొత్తంమీద మరీ గొప్పవాళ్లు అని చెప్పుకోవలసిన కొద్దిమందిలో లాటన్ ఒకడు. ఒళ్ళో పిల్లాడిలా తన బెంచిదగ్గర నిలబడీ కూర్చునీ ఆయన ఈ అభియోగాన్ని అద్భుతంగా నడిపి కోర్టునిండా, కథనిండా, సినిమానిండా అతనే ఉన్నాడన్న భ్రమ కలిగించాడు. గత వారం మిడ్‌లాండ్‌లో ఆడివెళ్ళిన 'కంపల్షన్'లో గొప్పనటుడనే అనిపించుకున్న ఆర్సన్‌వెల్స్ ఈ భావం కలిగించడానికి కోటుగౌను విప్పుకుని జుట్టు చెదరగొట్టుకొని అంతటా గోదామీద కుస్తీ పట్టేవాడిలా కలయదిరిగాడు...

విట్నెస్ చిత్రంలో ముద్దాయి వోల్ పాత్రను కీ. శే. టైరోన్ పవర్ నిర్వహించాడు. అతని భార్యగా ఈనాడు అమ్మమ్మల వయసులోపడిన జర్మన్ నటి మెర్లిన్ డీట్రిక్ నటించింది. పదిహేనేళ్ళనాడు ఆమె ఎంత గొప్పగా ఉందో ఇప్పుడూ అంత గొప్పగానూ ఉంది.

తప్పకుండా చూడతగ్గ చిత్రం.



'హెర్క్యులీస్' చిత్రంలో స్టీవ్ రీవ్స్, ఆనాశాసినా.

# హెర్క్యులీస్

కష్టసుఖాలను హృదయపూర్వకంగా అనుభవించ గలగడానికి అతిమానుష శక్తులను వదలి 'దివి' నుండి 'భువి'కి దిగివచ్చిన గ్రీషు బల సంపన్నుడు,—గ్రీకు పురాణపురుషుడు హెర్క్యులీస్ కథ ఇటాలియన్ సినిమా చిత్రంగా రూపొంది, అమెరికన్ ఇంగ్లీషు మాటలతో, అమెరికన్ మిస్టర్ యూనివర్స్ స్టీవ్ రీవ్స్ అనేఅతను ముఖ్యపాత్రధారిగా వచ్చి, మద్రాసు న్యూగ్లోబ్‌లో ఆడుతోంది. ఈస్ట్‌మన్ కలర్, ఇటాలియన్ ట్రేడ్ మార్కు సినిమాస్కోపులో తయారైన ఈ చిత్రంలో, హెర్క్యులీస్ వంటి మహా పురుషుల కథలు ఆవిష్కరించడానికి ఎంత అవధి ఉందో, అంతఅవకాశమూ ఉందని (సాంకేతిక ప్రగతినిబట్టి) అనుకుంటే పొరపడ్డవారమవుతాము. 'సినిమా స్కోపు' వంటి సాధనాలు పెరిగి వెడల్పు అయిన కొద్దీ సినిమాలలోతు స్కోపు మరీ కుంచించుకుపోతోందనడానికి ఈచిత్రం మరోనిదర్శనం. ఇందులో హెర్క్యులీస్ సాహసాలు చాలా ఉన్నాయి. సింహాన్ని చంపడం, ఎనుమును చంపడంవంటి పనులు కొస్తఅటూయిటూగా చేసిన ఘనులు ఎందరో వున్నారు. టార్జాను అంతకన్న ఎక్కువసింహాల్ని చంపాడు. (ఈసందర్భంలో ఈసినీ హెర్క్యులీస్ చంపింది సినీ సింహాన్ని తప్ప, దుర్భేద్యమైన కవచంతో అమేయమైనబలంతో సింహాలలో సింహం అయిన సింహాన్ని కాదు). మొత్తానికి వీటిలో హెర్క్యులీస్ వ్యక్తిత్వం గొప్పతనం స్ఫురించడం అవసరం. ఈ చిత్రంలో అది మినహా మిగతా సకలహంగులూ ఉన్నాయి. కొంత కథ కూడా ఉంది. జేసన్, అర్గోనాట్‌లూ గోల్డెన్ ఫ్లీస్ తేవడం, అమెజాన్ స్త్రీలకు దొరికి తప్పించుకోవడం వగైరాలన్నీ ఉన్నాయి. చివర హెర్క్యులీస్ గొలుసులు తెంచుకుని వాటితోనే చాలామందిని చంపడం, రాజభవనంమీదకి దండెత్తివస్తున్న సైనికులను ఆపడానికి స్తంభాలు లాగి భవనాన్ని కూల్చివేయడం (శాంసనుకే కాదు ఇది ఇతనికీ తెలుసు. ఎటొచ్చి ఈ చిత్రంలో అంత అద్భుతంగా చెయ్యలేదు) మొదలైనవన్నీ ఉన్నాయి.

హెర్క్యులీస్ జీవితంలో అతన్ని ప్రపంచ ప్రజానీకం హృదయానికి హత్తుకునేలా చేసిన సంఘటనలు లేవు. ఆ మాటకొస్తే స్టీవ్ రీవ్స్ వాలకం చూడగా హెర్క్యులీస్ కూడా లేడని పసిగట్టగలము. ఎవరో హీరో బోలెడు అద్భుతాలు చేస్తాడు చూదాం అని అనుకుని వెళ్తే తప్పక చూడవచ్చు.

సెట్‌లూ, ఔట్ డోర్ దృశ్యాలూ చాలా బాగున్నాయి. సంగీతం బాగుంది. ★

# ★ సంజీవకుని అంకె ★

(10 వ పేజీ తరువాయి)

సబిన్‌స్పెక్టర్లున్నారు అక్కడే. "మూయండి సార్, తలుపులు మూయండి... చోరీ-చోరీ" అని అరిచాను. స్టేట్‌బ్యాంకి నా అరుపులతో దద్దరిల్లిపోయింది. తలుపులు మూశారు. అందర్నీ వెదకడం ప్రారంభించారు. సీట్ వేషంలోవున్న ఒక్కవ్యక్తి దగ్గర నా సంచీ యిలాంటిదే మరొకటీ గూడా దొరికాయి సార్! సబిన్‌స్పెక్టర్లు స్టేషన్‌కు వచ్చి రిపోర్టివ్వమన్నారు. కాని నేను "అయ్యో! మా టీచర్లంతా బీదవాళ్ళు. మీతో వ్యవహారం ఒకనాటితో తెగది గాదు. నన్ను వదిలెయ్యండి బాబో" అని కాళ్ళూ, వేళ్ళూ పట్టుకు బ్రతిమాలి, భంగపడి వచ్చేటప్పటికి యింత లేటయింది సార్" అన్నాడు.

"అందరూ సంజీవిని ఎంతో మెచ్చుకుని "సభాష్ సంజీవి" అన్నారు భుజం తడుతూ.

కాని యిప్పుడు ఆ సంఘటన జ్ఞప్తికివచ్చే సరికి, యీరోజు పారిపోవడానికి అది పునాదాతంలాంటిదేమో నని భావించారు. శాస్త్రిగారూ, తదితరులూ - అందరూ "సంజీవి యిక మనకు కనిపించడు" అని నిశ్చయించుకున్నారు.

*  *  *

దూరాన ఎక్కడో మోటారుశబ్దం వినిపించింది. సాధారణంగా ఆ వూరికి మోటారు సైకిల్ మీద వచ్చేవారు ఒక్క సబిన్‌స్పెక్టరు మాత్రమే! ఆతనితో పరుగెత్తారు హెడ్‌మాస్టరుగారు ఆ వైపుకు.

దొంగసారా కాచేవాళ్ళ కోసం పోతూన్న సబిన్‌స్పెక్టరు ఆగి హెడ్‌మాస్టరుగారు చెప్పిందంతా సాంతం విని "రేపు పదిగంటల లోగా రాకపోతే రిపోర్టివ్వండి. ఇప్పుడే అక్కర్లేదు," అన్నాడు. తను చదువుకునే రోజుల్లో కొన్నాళ్ళు మోటార్ సైకిల్ నడపడం నేర్చుకున్న గోపాలరావుగారు నీళ్ళు నములుతూ "పోనీ—మీ సైకిలన్నా యిస్తే చిత్తూరుకెళ్ళి వెతికివస్తా," అన్నాడు.

"సారీ. ఇదిలేకుంటే నా కొక్క క్షణం గడవదు. బహుశా మీ లెక్క మారలేదేమో! అతనికి బస్సు దొరకలేదేమో! ఏ విషయానికీ రేపటిదాకా ఆగండి," అంటూ వెళ్ళిపోయాడు సబ్ ఇన్‌స్పెక్టరు. సబిన్‌స్పెక్టరు మాటలు ఎవరికీ రుచించలేదు. గోపాలరావు చెప్పిందే సబబేననిపించింది శాస్త్రిగారికి. ఎలాగైనా అందరు మేష్టార్లూ ఆ అర్ధరాత్రి చిత్తూరు వీధుల్లో గాలించి తెల్లవారేసరికి సంజీవిని పోలీసుల కప్పజెప్పాలన్న నిశ్చయానికొచ్చారు.

మరి వెళ్ళడం ఎలా?

ఇరవై రెండుమైళ్ళ ప్రయాణం అంటే మాటలుగాదు. అదీ లారీలూ, గిరీలూ ఎక్కువగా తిరిగే రోడ్డుకూడా కాదు మరి!

ఆఖరికి గురవయ్య శెట్టి కుటుంబాన్ని తిరుపతినుంచి తీసుకువచ్చిన 'వ్యాన్' గుర్తుకొచ్చింది శాస్త్రిగారికి. తక్షణం వ్యాన్ డ్రైవర్ని నిద్రలేపారు.

'ఎందరు' అన్నాడు డ్రైవరు.

'ఇరవై మంది'

'ముప్ఫయి రూపాయలు ఇవ్వండి. అంతకు దమ్మిడీ తగ్గినా ఈ అర్ధరాత్రి బండి కదలించను' అన్నాడు.

ఒక్క నెల చెమటోడ్చి పనిచేసిన ఫలితాన్ని దక్కించుకునేందుకు, యిందరి డబ్బును మూటగట్టుకొని వెడుతోన్న పచ్చి మోసగాడ్ని పట్టి బంధించి ప్రభుత్వాని కప్పగించేందుకు, ఆ నడిరేయి ఒక్కొక్కరు రూపాయిన్నర వెచ్చించడం ఎక్కువేం కాకపోయినా, ఇప్పుడు పెట్టుబడి పెట్టగల వ్యక్తి ఎవరా అన్న సంశయం అందరికీ పట్టుకుంది.

'నువ్వంటే నువ్వు' అనుకున్నారందరూ.

మళ్ళీ రోడ్డుమీద ఏదో లారీ వస్తూన్న శబ్దమైంది. ఇక ఈ వ్యాన్‌తో అవసరం లేదు. బస్సుచార్జీతో లారీలోనే వెళ్ళవచ్చు అనుకున్నారు. తీరా లారీ దగ్గరకొచ్చిన తర్వాత అది చిత్తూరు నుంచి వచ్చే లారీ అని తేలి, నిరాశతో తలా ఓ నిట్టూర్పు వదిలేశారు.

అలా నిట్టూర్పు ఎందుకు వదిలారు అంటే అప్పటికి సంజీవిని పట్టి పోలీసుల కప్పగించాలన్న బలీయమైన కోరిక బహుశా ఈ లారీలోనే సంజీవి దిగవచ్చుగదా అన్న ఆశకి అడుగున పడిపోయింది.

క్షణంలో లారీ ఆగడం, ఆ లారీలోంచి ఎర్రగా దుమ్ముకొట్టుకొని చేతిలో ఓ సంచీ పట్టుకుని ఓ వ్యక్తి దిగడం జరిగిపోయింది.

ఏదో ఊరినుంచి తండ్రి తిరిగి రాగానే పిల్లలు చుట్టూ చేరినట్టు మాగారు సంజీవి చుట్టూ వుపాధ్యాయులందరూ.

కొన్ని గంటల కాలంలో సాటిమానవుని మంచితనాన్ని ఏమాత్రం లెక్కించకుండా అతని జీవితానికి మచ్చ తెచ్చేటట్లు దుమారం లేపిన వారికి విధించవలసిన శిక్ష ఎంత కఠినతరంగా వుండాలో నా ఆలోచన కందలేదా సమయంలో.

సంజీవి చెప్పాడు: "ఇంతకు మునుపులా కాకుండా హెడ్‌మాస్టరుగారి సంతకం చెక్కులో మరోచోటగూడా వుండాలట. ఆ మాట చెప్పేందుకు సాయంత్రం ఆరు గంటలకిగాని తీరికదొరకలేదు ఆఫీసర్లకి. బస్సులన్నీ వెళ్ళిపోగా చచ్చీచెడీ యీ లారీలో వస్తున్నాను. ఎవరైనా చార్జీడబ్బులు ఆ డ్రైవరుకిచ్చేయండి" అన్నాడు రొప్పుతూ, సంజీవి.

ఉపాధ్యాయులంతా వెళ్ళిపోయారు. ఆఖరికి నేనూ, సంజీవి మిగిలాం రోడ్డుమీద. జాలిగా చూచాను అతనివంక. "ఏం చేయను మాస్టారుగారూ! నేను బయల్దేరేప్పుడు ఒక్క రూపాయకంటే ఎక్కువ లేదు నా వద్ద. ముప్పావలా బస్సుచార్జి కపోతే మిగతా చిల్లరా కాఫీకి సిగరెట్లకూ చాలనుకున్నాను. తిరిగి వచ్చేప్పుడు ఎటూ డబ్బు వుంటుంది కదా అనుకున్నాను. చెక్కు క్యాష్ కాకపోయె! బస్సుచార్జీ లేదు. ఏ బస్సువాళ్ళూ అక్కడికి చేరినతర్వాత డబ్బిస్తానంటే ఒప్పుకోక పోయిరి. ఎలాగో యీ లారీవాడంగీకరించాడనుకోండి" అంటూ పెద్దపెద్ద అంగలేసుకుంటూ చీకటిలో అదృశ్యమైపోతూన్న సంజీవిని చూస్తుంటే, తోటిమానవులపై ఏవేవో ఆలోచనలు నామస్తిష్కంలో ముసురుకున్నాయి. ★

# మనసులో సొగసు

(11-వ పేజీ తరువాయి)

వంటక్కోలోంది త్వరగా నీళ్ళోసుకుని భోంచెయ్యి. ఎప్పుడనగా తిన్నావో.'

నాకేమిటో ఆవిడచరిత్ర తెలుసుకోవాలనే కోరిక గడియగడియకూ ఎక్కువై పోయింది రాధా! మధ్యాహ్నం చిన్న కునుకు పట్టింది కాబోలు ఆవిడ తమ్ముడు వరండాలోకి వచ్చాడు. నాగదిలోకి పిలిచించి నేనెందు కొచ్చేనో కొంచెంచెప్ప అడిగిచూశాను. పాపం చనువుగా నే మాట్లాడేడు కూడా!

'ఆవిడ మీ అక్కయ్యా? ఏంజబ్బండీ? ఎలా ఉందీ?'

'ఆవిడ నాకేకాదు ప్రపంచానికే అక్కయ్య. ఇక జబ్బుసంగతా, ఒకజబ్బని ఏం చెప్పను? మందు లేనివ్యాధి. చావుతో కుదిరేజబ్బు. ఇంగ్లీషులో చెప్పాలంటే 'హార్ట్ ఫెయిల్యూరూ, హైపర్ టెన్షన్' అంటారు. గుండెల్లో బాగాఆయాసం. రక్తంపోటు యెక్కువ. ఇరవై నాలుగంటలూ కూచునేఉంటుంది. పడుకోలేదు. 'హార్టు ఎటాక్సు'అని వస్తాయి. మా ఊళ్ళో ఉన్నప్పుడు ఒకటివచ్చింది. గిలగిల కోడి పిల్లలా కొట్టుకుంటుంది. ఆబాధ ఎవళ్ళం చూళ్ళేం'

'ఇక్కడికి వచ్చాక ఏంనయంకాలేదా?'

'ఏంనయం, ఇవాళే డాక్టరు చెప్పేడు అదింక బతకదని .. ఈసారి ఎటాక్ వచ్చిందా ఇక లాభంలేదు. నేను కోరేది ఒక్కటే. దాని బాధలు చూడలేక పోతున్నాము. త్వరగా తీసికెళ్ళిపొమ్మని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను!'

'ఊరుకోవాయినా ఏంచేస్తాం, పాపం ఇవన్నీ ఆవిడకి తెలియవుకాబోలు. ఎంత మొండి ధైర్యం!'

'దానికి ఇవన్నీ తెలియ వనుకుంటే మనమే తెలియనివాళ్ళం ఔతాం. దానికి అన్నీ తెలుసు...దానిదగ్గిర ఏవిషయం దాచడం ఎవరి తరమూకాదు. థర్మామీటరు చూస్తూంటే ముఖంనిల్చి బట్టి ఎంతజ్వరముందో కనిపెట్టేంత సూక్ష్మబుద్ధి'

'అదేం ఆమె స్వయంగా చూసుకోలేదా?'

'ఏం చెప్పమన్నారు! మూడోసారి ఎటాక్ వచ్చి తగింతర్వాత దానికంటిచూపు బాగా దెబ్బతింది. జీవితమంతా అంధకారమైనా, అది మనసులోంచి ఎలానవ్వగలదో నాకేం అర్థంకాదు. మా మాలు అమ్మలక్కల్లా అది పనికిమాలిన కబుర్లతో కాలక్షేపం చెయ్యలేదు. ఇంట్లో అన్నిపనులూ అయిపోయాక...గచ్చునేల శుభ్రంగా తుడుచుకుని వెల్లకిలా పడుకుని పక్కని ఒక పేట్లో ఏకాదశ్యుపవాసో పోసుకుని అవుల్లూ ఎప్పుడూ ఏదో పుస్తకం చదువుతూండేది. ఇప్పుడు ఈవ్యాధి అలా పడుకోనివ్వదు ఈ కళ్ళు అలా చదువుకోనివ్వవు. మాకు చేతనయినంతకాలం మాయింట్లో ఉంచుకుని మందులిప్పించాం. ఇంజక్షన్లు ఇప్పించి మానాన్న వేలకివేలు తగలేశారు. ఏంలాభం! రోగం ఒక్కలాఉంది. ఇంగ్లీషు మందులు ఇప్పించి రోగం ఎక్కువచేశారని మా బావగారి వాదన. ముందునుంచీ ఆయుర్వేద మందులు ఇచ్చి రోగం ముదరపెట్టేరని మా నాన్నగారివాదన. ఆఖరికి ఇంచుమించు ఆయనతో దెబ్బలాడి అక్కయ్యను ఇక్కడికి తీసుకొచ్చేశా. ఇంతజబ్బులో దీనికి ఈమనో వేదన ఒకటి...ఆయాసంతగ్గి నిద్రపట్టాలీ అంటే మనసు నిర్మలంగాఉండాలి. అమాట ఒక్కరికైనా ఉంటేగా? నాకక్కడ ఉద్యోగం. వచ్చి న్నాళ్ళుండగలను చెప్పండి?...అదిలేచినట్టుంది' అని వెళ్ళి పోయాడతను.

ఆ తరువాత ఒకనాడు చుక్కచుక్కల చీరకట్టుకుని తెల్లనిజాకెట్టు తొడుక్కుని తలనిండా మల్లెపువ్వులతో అన్నిటినిమించి కళకళలాడుతున్న మొహంతో మొగుడి గడ్డంపట్టుకుని ఆమె ఏమంది?

'ఎందుకలా విచారంగా చూస్తారు? నాప్రాణం పోతుందని భయమా? ఇన్ని ఎటాక్సువచ్చాయి. మొండిదాన్ని నన్నెవరు తీసికెళ్ళగలరు? అన్నీ వచ్చినట్టే తగిపోతాయి. ఎందుకా కన్నీళ్ళు? ఇలా చూడండి. ఎందుకలా పిచ్చివాళ్ళయిపోతారు? ఇలా చూడండి. జుట్టిలా మొహంమీద పడుతోందేం? ఎబ్బెట్టు మొహంకడుక్కుని తలదువ్వుకురండి......పొండి నేచెప్పినట్టు చెయ్యరా......అంతేకదూ?' అని ముద్దు చేసింది భర్తని. ఆవిడ మనిషా, దేవతా? ఇలాంటివాళ్ళని చూళ్ళేదు. కనీసం ఎప్పుడూ ఊహించనైనా లేదు కూడా. మృత్యువు ముందు వాకిట్లో ఉందని ఆవిడకి తెలుసు; అయినా ఆఖరి గడియదాకా ఎదుటవాళ్ళకి జవాబు చెబుతుందా! ఆవిడ ఆ మరునాడు చనిపోయిందంటే ఎవరుమాత్రం ఎలానమ్ముతారు!

అంతదైన్యంలో ఆవిడ అంత మొండిగా ఎలా నిలబడగలిగింది? ఈప్రశ్న ప్రతిక్షణం నన్ను వేధించసాగింది. బాగా ఆలోచించగా నాకు సమాధానం దొరికింది. ఆవిడకు తన మీద నమ్మక ముంది. ఆవిడ ఆనమ్మకంతోనే జీవించింది. జీవితానికి అర్థమేమిటో గ్రహించింది. కనుకనే బ్రతుకును సార్థకం చేసుకుంది. పాడువిధిగాని, పరిస్థితులుగాని ఆమె ఆత్మసౌందర్యాన్ని అణుమాత్రమైనా కదల్చలేకపోయాయి. అందులోని అనంత విశ్వాసం నిలిచేఉంటుంది. ఆమె మృతజీవి.

ఇంకొకరినిగురించి ఆలోచించడం నా కప్పుడే మొదలు. నిజం చెప్పవలసివస్తే ఆ క్షణంనుంచే నేను జీవించడం నాకోసం కాదు ఎదుటివారికోసం అనేభావంలో ఎంత మాధుర్యముందో గ్రహించాను. ప్రతీ చిన్న విషయంలోనూ ఆమెతో నన్ను పోల్చి సాగేను. సిగ్గుతో నా తల వాలిపోయింది. 'వెంటనే ఇంటికి వెళ్ళిపోదాం నాకేజబ్బూ లేదు'అని ఆయనతో చెప్పేదాకా, మొహమెత్తి ఆయన్ని చూడలేకపోయాను

ఆమె ఎవరో ఊరూపేరూ నాకిప్పటికీ తెలీదు. తెలుసుకోవలసిన అవసరంకూడా లేదు ఎవరైతేనేం? ఆమె నాపాలిదేవత. జీవించడం ఎలాగో ఎందుకో నేర్పినగురువు. నిజానికి నాకుటుంబంలో నేనూ ఉన్నాను అనేందుకు ఏంచేశాను? తలనొప్పివస్తే ఆయన సరిగ్గా కనుక్కోలేదని అన్నం మానేసిన రోజులూ, పిల్లల్ని ఎందుకుకొట్టేవని ఆయన అడిగినంతమాత్రాన మాటలు మానేసిన రోజులూ నన్ను వెక్కిరించాయి. అయినా ఇప్పటికయినా స్త్రీకి ఏది భూషణమో ఏదికవచమో నాకు తెలిసింది. తెలిసిందేమిటి? అది ఆచరణలో పెట్టడానికి మనసా ప్రయత్నంచేశాను. ఇప్పుడింట్లో అన్నిపనులూ నేనే చేసుకుంటున్నాను. మునుల పనిలేదు, ఇప్పుడు తీరికలేదు!

రాధా, ఈసారి యీవూరువచ్చినప్పుడు మాయింటికి భోజనానికిరా. మాతోపాటు భోజనానికి కూర్చో. ఆదరణ అంటే ఏమిటో కొత్తగా తెలుసుకున్న నాపిల్లల ఆనందం చూడు. అంతకన్న చిన్నపిల్లలతో సమానమయిన వెన్నమనస్సుగల ఆయనకళ్ళ వెలుగుచూడు. నా ముఖంలోని తృప్తి, సంతృప్తి చూడు. నీవు చూడగలిగింది అంత వరకే. కాని నాకళ్ళకు — చుక్కచుక్కల చీరా, తెల్లనిజాకట్టూ, మల్లెపువ్వులూ, కళకళలాడుతూ నన్ను చెయ్యెత్తి దీవిస్తున్న, నిండైనబతుకు బతికిన, వెయ్యిజ్యోతుల వెలుగుముఖం ఎప్పుడూ కనిపిస్తుంది!



## న్యూఢిల్లీ లేఖ

(14 - వ పేజీ తరువాయి)

కాటురంగానికి చెందినవని ఆయన అన్నారు.

ప్రచార (పబ్లిసిటీ) సాధనాలలో అతిప్రధానమైన రేడియో, టెలివిజన్‌లు మాత్రం పబ్లిక్ రంగంలోనే ఉన్నాయి. పత్రికలపై అధికారానికిగాను అడ్వర్ టైజ్ మెంటు కంట్రోలు ప్రభుత్వం వహిస్తోంది. దేశభక్తితో జాతీయసేవ పత్రికలు కొనసాగిస్తూనే ఉన్నాయి. అయితే ఆహార ధాన్యాల ప్రభుత్వ వ్యాపారంపైనా, చైనాపట్ల ప్రధాని వైఖరిపట్ల,మాత్రంతమవిధిగా గుర్తెరిగి పత్రికలు విమర్శించడం జరుగుతున్నది. అది స్వగళంపట్ల తమ విధిగామాత్రం పత్రికలు మున్ముందుకే తలుస్తున్నాయి. గతకొన్నేళ్లుగాగనక పరిశీలిస్తే కాంగ్రెసువారు కళంకన్న తమపదవులు మిన్నగా ఎంచారు. పత్రికలుమాత్రం తమ ప్రచారంకన్న దేశాభివృద్ధిని, క్షేమాన్ని ఖచ్చితంగా మిన్నగా కోరుతున్నాయి.

భారతీయ పత్రికలను యథేచ్ఛగా విమర్శించడం శ్రీ నెహ్రూకే చెల్లు! ఆయన రాజకీయజీవితం ప్రారంభించినప్పటినుంచీ కూడా పత్రికలు ఆయనకు విశేషప్రచారం కలిగించాయి. మొన్నటి చండీఘర్ ఉపన్యాసంలోకూడా చెప్పింది చెప్పడం తప్పించి కొత్తవిషయం ఏమీ లేకపోయినా కూడా పత్రికలన్నీ ప్రముఖంగా పతాక శీర్షికలతో ప్రకటించాయి.

ఇంతకూ పత్రికాప్రపంచంపై శ్రీ నెహ్రూ విరుచుకుపడడంలో ఆయనకు ధర్మబొత్తిగా గిట్టదనే విషయం తేలుతుంది. ఆయన చెప్పినదానిని బలపరచి స్వతంత్ర పత్రికాప్రపత్రికలు ఆయన అభినందనం చూరగొన్నాయి—ప్రయివేటు రంగానికి చెందినవైనా సరే.

భారతీయ పత్రికా చరిత్రలో 'ఇండిపెండెంట్' అనేపత్రిక స్థాపన ప్రత్యేకత. శ్రీ నెహ్రూ జనకులు శ్రీ మోతీలాల్ నెహ్రూ దాని సంస్థాపకులు. శ్రీ సయ్యద్ హుస్సేన్ ఆపత్రిక ఎడిటర్. అది కాలం నిలువలేకపోయినా అప్పటినుంచీ దేశంలో పత్రికలు పెరిగిపోయాయి. కొన్ని క్రమంలో కొట్టుకొనిపోగా, కొన్ని బాగా బలంగా నిలచిపోయాయి.

అయితే పత్రికలుచేస్తున్న విమర్శలేమిటి? ద్వితీయ పంచవర్ష ప్రణాళికను శక్తికిమించి దూకుడుగా అమలు జరుపదలచిందని భారతీయ పత్రికలన్నీ ముక్తకంఠంగా విమర్శించినమాట నిజం! ఏదిఏమైనా అది అమలు అయితీరాలి అని ప్రధానమంత్రి బల్లగుద్ది చెప్పారు. అయితే ఆయనే చెయిర్మన్‌గా ఉన్న ప్రణాళికా సంఘం ప్రణాళిక మొదలుపెట్టిన రెండు నెలలోగానే ఖర్చులు, ప్లానులు చాలా కుదించవలసిన అవసరం ఎందుకు కలిగింది? అలాగే ఆహారధాన్యాల విక్రయం చేయడానికి ప్రభుత్వానికి తగిన అనుభవమూ, సిబ్బందీకూడా లేదని, ఇది దుస్సాహసం కాగలదని పత్రికలు ఘోషించాయి. ఇది అమలు జరిపిన ఏడాదిలోగానే ఆహారమంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైన్ బహిరంగంగా ప్రభుత్వపు ధాన్య విక్రయం విఫలమయినదని ప్రకటించి మరీ రాజీనామా ఇవ్వడం జరిగింది.

ఇక చైనా వ్యవహారం: ఈ విషయంలో చైనా జరిపినదాడి అలావుండగా "పంచశీల" ప్రపంచమంతా అల్లుకుపోవాలనే పత్రికలు కోరుతున్నాయి. పత్రికలు ఇందుకేదో ఇబ్బంది కలిగించాయని శ్రీ నెహ్రూ భావించడం-అది తొందరపాటుగా ఆయనే తెలుసుకోవలసి రావడం బహుశః ఆయన కినుకకు గల మరో కారణమేమో! ★

# ఆంధ్రపత్రిక గళ్లనుడికట్టు-2.



## అడ్డం

1. మొదట్లోనే అప్పరక
4. అడవి తిరగేశాను కొన మరకేసి వరి.
5. యుద్ధం స్వతస్సిద్ధంగాగల ఉద్యోగి.
8. మూర్ఖ నాయకుడూ కూడా చెల్లాచెదరై పోయారు!
9. పెళ్ళయి గనుక నే పోట్లాట
10. నక్షత్రం
11. ...న్నాడు జాగ్రత్త!
12. కేసు
14. పనికిరానివా!
16. అటిన్నించైతే కరుస్తుంది.
17. అంబను పలికించేవి.

## నిలువు

1. ఆహ్వానం
2. ఇది తెలియనివాడు రాజకీయ క్షేత్ర పోతాయి కాలేడు.
3. అమ్మ!
6. ఈ చివరా ఆ చివరా ఒకే అక్షరముంటే సంతోష విషాదాలూ కం చేస్తుంది.
7. గున్న పోతై పుట్టువాడ!
9. మళ్లీ చప్పాను!
13. పోరాలు కలబోస్తే ప్రవాళం
15. మూడతుంగులలో యేసుకు!

## మొదటి నుడికట్టుకుజవాబులు



| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| చే | త | బ | డి | | పా | వు | రా | ళ్లు |
| మ | | | రా | | క | | | |
| కూ | | అ | బ | | ము | ర | | సా |
| ర | | ట | | | | మా | న | ము |
| | | వి | క | ట | క | వి | | |
| నా | ను | డు | | | | ఘ | | అ |
| ర | | పు | ట | | పా | డు | | న |
| | | | ము | | ప | | | వా |
| చి | వ | ర | కు | | ము | రు | గు | లు |

---

# పుస్తక సమీక్ష

(ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు వారు నిర్వహించిన "పుస్తకసమీక్ష" పోటీలో మొదటి బహుమతి పొందిన సమీక్ష.)


యు. విజయలక్ష్మి
(కోయంబత్తూరు)


**చివరకుమిగిలేది: రచన: బుచ్చిబాబు**

తెలుగు నవలా సాహిత్యంలో ఒక క్రొత్త రకపు ఆలోచనా విధానాన్ని, రచనా శిల్పాన్ని ప్రవేశపెట్టిన నవల 'చివరకు మిగిలేది.'

నాయకుడు దయానిధి ఏకాంతంగా తప్ప మనుష్యులమధ్య మనలేని విచిత్ర వ్యక్తి. నవల మొదలయిన కాలానికి అతడు మెడికల్ కాలేజి విద్యార్థి. వివిధ మనస్తత్వాలకు చెందిన వ్యక్తులతోడి సాహచర్యము అతనికి జీవిత సమస్యల విలువల నన్వేషించడానికి ప్రేరణ కలిగించింది. అతనికి గ్రంథపరిజ్ఞాన పరిచయమయితే వున్నది కాని, దాని అంతరార్థం ఆకళింపు కాలేదు. జీవించడానికి బదులు జీవితాన్ని గురించి ఆలోచిస్తాడు. తర్కంతో సాధించిన సిద్ధాంతాలతో తన్ను తాను బంధించుకున్నాడు. జీవితంలో తారసిల్లిన విషాదాన్ని అనుభవించడానికి సహజత్వాన్ని కోల్పోయాడు. ఎదుర్కోడానికి మానసిక బలం చాలలేదు. తృణీకరించడానికి కావలసిన వేదాంతదృష్టి అలవడలేదు. సహజప్రవృత్తులకు విపరీతార్థాలు చెప్పుకుని వానిని 'జయించే' ప్రయత్నాలతోనే జీవితాన్ని నింపుకున్నాడు. ఆ కారణంచేతనే సహజమైన మనుష్యులతో కలసి జీవించలేకపోయాడు. అన్వేషణ అతని జీవలక్షణం.

ఇంకా యీ నవలలో, కష్టాలు రుచి చూసినా వ్యక్తిత్వం పోగొట్టుకోని నాగమ్మ, బ్రతకడం మొదలుపెట్టకముందే జీవితంలోని విషాదాన్ని పసిగట్టి, నిరీహాదృష్టి వలవచ్చుకున్న జగన్నాథం, నాగరికతకు దూరంగా బ్రతికిన కోమలి, అమృతహృదయ అమృతం మరపురాని పాత్రలు.

నవలలోని కథావస్తువులకు విశిష్టత, ప్రయోజనము తక్కువేఅయినా, నవలలో మానవజీవితానికి సంబంధించిన, భౌతిక మానసిక, ఆధ్యాత్మిక సమస్యల గురించి ప్రకాశమైన ఆలోచనలు నవలకు క్రొత్త విలువను సాధించిపెట్టాయి. 

---

## 9వ సమస్యకి పరిష్కారం

1. గు—శ 6 సా! బ × రు
2. మ—శ 8 సా!! రా × ను
3. శ—రా 6 సా రా—గు 1
4. రా—వి 8 ఆటకట్టు.

---

# తెలుగు వెలుగులు

(15-వ పేజీ తరువాయి)

సాధారణం! శతావధాని అఖండ కవిత్వం అపూర్వ నాటకీయ ఫణితి చిన్న కథలలో ఎక్కువగా గోచరిస్తాయి. ఒక్క వాక్య మలుపులో కథావ్యంగ్యం సమస్తము స్ఫురింప చెయ్యగల దిట్ట శివరామశాస్త్రి. జాతీయమైన స్వచ్ఛ గద్యరచనలో వారి తులతూగగలవారు అయిదారుగురుంటారేమో. మహాత్ముని ఆత్మకథలో వెల్లివిరిసిన తెనుగువాణి వచన రచనకే ఒక గొప్ప ఒరవడి.

ఈనాడు కొందరు పెద్దల రచనలు చూస్తూంటే 'వీరిపాటికి విరమిస్తే బాగుండేదిస్మీ!' అనిపిస్తుంది. అయితే పరిణతప్రజ్ఞ శ్రీ శివరామశాస్త్రి తిరిగి విజృంభించి రచన సాగిస్తే 'ఆంధ్రవాణి కీపాటికి ప్రపంచంలో పట్టం కట్టుకోలేమా!' అన్న ధీమా కలుగుతుంది!

---


Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad



కల్యాణసుందరుడు (తిరుకోవిలి)

—ఫొటో: ఎన్. రామకృష్ణ.